

# ప్రతాపాగ్బరీయము.

ఇది

బళ్ళారిలో వకీలుగానుండిన

కీ. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుచే

రచియింపఁబడిన చరిత్రనాటకము.


కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపబడియె.

మొదటికూర్పు.



బళ్ళారి.

ఆంధ్రాముద్రాక్షరశాలయందు

ముద్రితము.

**1925.**

## నాటకమునందలి పాత్రలు.

### పురుష పాత్రలు.

అక్బరు
బైరాము
పీరుమహమ్మదు
ఖాన్ ఖాన్
రాజామాన్
హైమాము
అబ్దుల్ ఫజుల్
మల్లాదేవ
బలవంతదాసు
ఉదయసింగు
రవివర్మ
సూర్యసింగు
భాస్కరసేన్
ప్రభాకరరావు
రామసింగు
లక్ష్మణసింగు
షాహిదాసు
జైమల్
పట్టి
సుక్త
జగదేవ
ప్రతాపుడు
రామభట్టు

జగ్ మల్లు
విక్రమసింగు
ఉమ్రా
లక్ష్మణభట్టు
కుబేరసేన్
జయదేవ
భీమజి
శేషజి
కృష్ణసింగు
దౌలతుసింగు
సర్ దార్ సింగు
బలవత్ సింగు
హైమల్లు
పృథ్వీరాజు
బీరుమల్లు
సలీము
జగత్ సింగు
సంగ్రామసింగు
రణసింగు
ఆసాధు
భిల్లనాయకుడు
పురోహితులు
అక్బరుసేన

### స్త్రీ పాత్రలు.

కమల
భైమాదేవి
పద్మిని
కుముదిని
లక్ష్మాంబ
శ్యామలాంబ
జోదుబీ
చిక్కాబాయి

సౌభాగ్యవతి
మంగళాంబ
ప్రభావతి
గౌరాంబ
భ్రమరాంబ
కాళి
పురస్త్రీలు
సుందరాంబ

## శ్రీనివాససుకవి జీవితచరిత్రం.

ఎవ్వాని వదనరాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలు సలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితా కన్యకను దనదు సంజీవినిచే దెప్పిఱిల్లఁజేసి ఒజ్జలమిన్నయని వన్నెకెక్కెనో! ఏమహామహుని దివ్యనామామృతమును వీనులారఁగ్రోలని యతఁడు రాస్యుఁ డొక్కఁడైన నీభువిని గానంబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిద్వద్వతంసుఁడు అనన్యజన సామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మార్గదర్శియయ్యెనో! అట్టి చులుకీకృతసకల శాస్త్రజలధి యగు కోలచల శ్రీమల్లినాథసూరి వంశమున, మన శ్రీనివాస కవిముక్తామణి విరూపాక్ష క్షేత్రమునకు సమీపముననుండు కామలాపురమను గ్రామమునఁ గ్రీస్తుశకము **1854-8-13** తేదీలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁ డుద్భవించె. ఇతఁడు బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయ భాషయం దసమానవైదుష్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగమునుండి, తర్వాత న్యాయవాదిపరీక్షలయం దుత్తీర్ణుఁడై బళ్లారి పురవరమున న్యాయవాదిగ వెలుగుచుండెను. ఇతనికి నొకకూఁతురును, నలుగురు కుమారులును గలరు. మఱియు నితఁడు **1917** సం॥ ఏప్రెల్ **7** తేది దేహళీపురమున జరిగిన విద్వత్సభ యని ప్రసిద్ధిఁగాంచిన యాంధ్రసాహిత్య పరిషత్సభకు గ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్లుండ నేతత్కవిచంద్రుఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్రకువలయంబు వసివాడఁగ సుకవిచక్రంబు లుల్లసిల్ల **1919** సం॥ జూన్ **28** తేది యస్తమించె.

ఇట్లు విన్నవించు,

సుకవిజన విధేయుఁడు,

రావాడి - వెంకటరామశాస్త్రి

తెనుఁగుపండితుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి.

సీ. ఘోరన్వయోచ్ఛ వాఘోరకర్మం బులఁ
బాపెనేనీసుఁడీ భరతభూమి
త్రైమూర్త్యసంకాశ్చి తాాధిపతి ంబ
రేనెవఁడతాతత్రాు యొలమిమించె
విమలశీలత మించుహూ మహాయానుఁడె వ్వాని
తంద్రి హైమకీర్తిసిస్తంద్రుఁడయ్యె
సంకటజ్జలనిధి సంభవించిన్ను సౌఖ్య
వారిధిలోఁ దేలెపిరుఁ ఘావఁమ.

గీ. భరతఖండమేలి భవ్యుఁడై నిర్మల
యశము దిశలనెల్ల నాక్రమింపఁ
జేసె నెవ్వఁడట్టి శ్రీమంతు నశ్వరు
కథను నాటకముగఁ గనుడిమీరు.

( నిష్క్రమణము. )

౩



# ప్రతాపాగ్బరీయము.

ప్రథమాంకము - ప్రథమరంగము.

అగ్ర. పాదుషాస్థానము.

అక్బరు - బైరాము - పీరుమహమ్మదు - ఖాన్‌ఖాన్ - రాజామన్ - హేము

సేవకులు.

అక్బరు:— ఉ. కాననసీమఁ గ్రుమ్మరుచుఁ గష్టజలాంబుధి మున్గి తేలుచున్
దీనతఁ గుంది నాడువిడి దిక్కుమఱేదియు లేక చిక్కుచున్
మానిని వెంబడింప వనమార్గములందుఁ గృశించె బాదుషా
మానవ నేత దైవగతి మాన్పఁగ వచ్చునె యెంతవానికిన్.

సభాసదులారా! దైవమాయ విచిత్రంబు. ఏకచ్ఛత్రాధిపతిగ భరతఖండమేలిన నాతండ్రి హుమయూను కాలవిపర్యయంబున షేర్షా యనువానికినోడి నాడువీడి నిలువనీడలేక, గ్రామైక రాత్రిగఁ దిరుగుచుఁ దనమిత్రుఁడగు జోధపురము రాజు మల్లాదేవునిఁ జేర నా ద్రోహి స్నేహధర్మంబు మాని, పగఁబూని, నా తండ్రినిఁ బట్టిచంప యత్నించెనఁట. హా హా! ద్రోహమనిన నింతకన్న హెచ్చుకలుగునా?

చ. అడవినిఁ జిక్కి స్రుక్కుచును నాఁకలి మెండయి సొమ్మసిల్లుచున్
బడలిక హెచ్చి దప్పిఁ గొని, ప్రాణముఁ బోవఁగనున్న దీనునిన్
బుడమిఱేఁడైన నాజనకుఁ బుణ్యచరిత్రునిఁ జూచి దేశమం
దడుగిడఁ గూడదంచు విడనాడిన ద్రోహిని నుక్కడంచెదన్.

అటకటా! ఆ మల్లాదేవుఁ డారీతి స్వామిద్రోహ మొనరింప నా తండ్రి సంకటపడి, నను నిండుగర్భముతోనున్న నాతల్లి హమీదాబానుఁ గూడి, యెడారులలో సంచరించుచు, నీ రెందును గానక దప్పిఁ గొని పాదచారియై యెట్టకేలకు దైవవశంబున నెటులనో అమీరు కోటఁ బ్రాణంబునఁ జేరెనఁట. అచ్చటి యధికారి దయాశీలుఁడయి నాతండ్రికి సాహాయ్యపడి నాతల్లిని రక్షించెనఁట. ఎంతటియిక్కట్టునఁ బుట్టినను దైవానుగ్రహంబున నేనింతటి సుఖమును గంటిని. అయినను నా మానసంబునకు సుఖము కలుగకయున్నది. ఆ హీనజాతిని హింసింప హేమూ యను నాయుడు మహమ్మదు ఆదిల్‌షా ప్రబలించి మాకంటకులునై బాధిం

చుచున్నవాఁడు. వానిఁజంపి హిందూభూపతుల భూపతిత్వనంబొనరించినఁగాని సింహాసనము సుస్థానమై యుండదు.

బైరాము:--మహాప్రభూ! కాలానుగుణ్యంబుగ రాజులు ప్రవర్తింపవలెను. కష్టార్జితరాజ్యంబు రక్షించు కొనుట రాజధర్మమగును. వైరశుద్ధికొరకై యార్యావర్తమందసంఖ్యాకులై యుండు హిందూ రాజులతో వైరంబుఁబెంచితిమేని వారు రాజ్యక్షయకారకులగుదురు. కావున మనమే యుపాయమునకైన హిందూరాజులతో సంబంధముఁగల్పించుకొని వారిసఖ్యమందవలెను. అంతటఁ దృప్తిఁజెందక, హిందూమతస్థులగువారికిని వారికేకలహములఁబెంచి, వారిపేరులమైఁ బలయుక్తినటు లొనరింపవలెను. మహాప్రభూ! చక్కఁగ నాలోచింపుము.

చం. జఘనధరిత్రి మూలమయె, జాతిసహోదరులెల్ల నీసునన్
మనకవుకై యపాయములమానుషవృత్తిని సల్పుచున్నవా
రననిక నేమి? యిట్టితఱి నారయ నార్యులతోడఁ గూడికల్
మనయభివృద్ధికిన్ దగినమార్గమగున్ వలపోయుమా మదిన్.

అక్బరు:—సచివవర్యా! నీ యుక్తిప్రాయంబు దీర్ఘాలోచనా జనితఫలంబు గావుననవశ్యానుసరణీయంబు. అటులొనరించెద. ( బైరామునుఁజూచి ) నాయనా! నా రాజ్యకంటకుండై పలుబాధల మమ్ముఁగాఱించిన హేమూయను దురాత్ముని యుద్ధమునఁ బట్టితినని పలికితివికదా! వాఁడెచటనున్నవాఁడు? వానికింతటి బలమెటువచ్చెను?

బైరాము:—మహాప్రభూ! మీ తండ్రికి జన్మద్వేషియయిన షేర్షాగారి మరణానంతరము, సలీముగారు రాజ్యమేలినసంగతి మీకువిశదముగదా? వారుస్వర్గస్థులగుకాలమున వారికి ఫిరోజ్ యను పన్నెండేండ్ల బాలుఁడొకఁడుండెను. వాఁడు మూఁడుదినములుమాత్రము రాజ్యమేలెను. పిదప వానిమేనమామయగు మహమ్మదు, తల్లిప్రక్కననున్న బాలునిఁజంపి తారాజాయెను. హేమూయనెడి యీ హిందువు నీచవృత్తిని జీవించుచు, విషయాధీనుఁడైన రాజునకు సేవకుఁడయి కాలక్రమమున పరరాజుల యుద్ధమునందెదిరించి జయించునంతటి సమర్థుఁడాయెను. దైవానుగ్రహంబున నా బాణంబు వాని కంటికిఁదగిలిన కారణంబున యుద్ధమున వానిఁబట్టితిమి.

( సేవకులు హేమూను బట్టికొనివచ్చి అక్బరెదుట నిలుపుదురు. )

మహాప్రభూ! వీఁడే నా పలుకంబడినద్రోహి. ఇదిసుదినము. వీనిఁజంపుము.

శా. స్వామిద్రోహినివీనిఁ జంపి పుడమిన్ స్థాపింపుమా మామత
స్వామిత్వంబును, ఘాజియన్ బిరుదమున్ సార్థంబుగాఁ జేయుమా
భూమీశా! యిదిరాజధర్మమగు సంపూజ్యంబగున్ లెమ్ము యీ
సేనంబూనుట సర్వసమ్మతమగున్ నిత్యాను మోదంబగున్.

హైమ:—( నవ్వుచు ) ఏమీ! భైరాం! మరణమునకు నే వెఱతునని తలంచితివియా? ఎన్నటికి వెఱవను. రణావని నీ శిరంబుఁ బఱగఁజాలనైతినే యని చింతించెదను గాని, నా మరణంబునకు నే వ్యసనపడను. ( అక్బరుంజూచి ) భూమిపాలా! ఆలస్యమేల? నీ సచివవర్యుని హిత బోధనల నాలోచించి నా శిరము నైశొప్పున్నదఱిగి నీ మనంబును స్థాపింపుము.

ఉ: పుట్టితిఁ బేదనై పుడమి, భూరిపవిత్ర శౌనందపిసుందిటీక్
కట్టిడివర్త కుండనయి కాటియలందితిఁ గొంతకాలమున్
నెట్టితి రాజ్యమున్వదల నీజనకున్ ఘనసత్వశాలినై
గిట్టఁగ నేల దుఃఖమిఁకఁ గీడ్వడి యంధుఁడనైనృపాలకా!

భూపాలా! ఈ శరీరబాధచే నేమనఁగలం.

భైరాం:—మహాప్రభూ! ఈ ద్రోహినిఁ జంప నాలస్యమేల?

అక్బరు:—సచివవరా!

ఉ. ఉత్తమజన్మమంది నిఖిలోత్తమ రాజ్య పదంబుఁ జెంది స
ర్వోత్తమనీతిధర్మముల నుగ్గు గఁగాంచిన భూమిపాలువా
లెత్తునె యుత్తమాంగమున నత్యధికంబగు సత్క్రియుస్త్రముల్
హత్తనిహాని ప్రభుల? నొరయుపేమది రాజధర్మమే.

సచివవర్యా! కులాగతశాంతమంతయు మాని నాస్వాంతము దుర్బలునిఁ జంపుటనిఁ బూను నే నే అసంఖ్యాకులై వచ్చి నన్నెదిరించు కఠినారుల శిరంబుఁ బఱగఁ జేర్చిన నా కరవాలంబు విగతాత్ముఁడగు నరునిపైఁ బ్రయోగింపనగునా? వలదు.

భైరాం:—( కోపమున ) ఇట్టి దయాశీలురు మీ వంశమువారు కావుననే మీరేలురాజ్యముల యందె న్నియో దోసంగులు హాసంగుచుండును.

కం. అరులిడఁ దపశీలనతటి న
ష్కారుణను జలమూని హరిజంపుట ధర్మం
బనయము తప్పిన ముప్పయి
నిరతము రిపువహ్ని రాజినిన్నంటున్నృపా!

అక్బరు:—సచివవర్యా! నా క్షేమమునకై నీవెన్ని హితంబు లుపదేశించినను జిక్కువడిన యీ యంధుని సంహరింపఁజాల. వానివిషయంబున నీ యిష్టానుసారం జేమయినను జేసికొనుము.

భైరాం:—( సేవకులం జూచి ) ఓరీ భటులారా! వీనిఁ గొనిపోవుడి, వీనిపని నేను ముగించెద.

( సేవకులు హైమూనుఁ బట్టుకొని నిష్క్రమింతురు. )

మఱికొందఱుభటులు జోడుపూరు అంబరురాజులను దెచ్చి యెదుటనిలుపుదురు. వారు తల వంచికొని నిలిచియుందురు. )

అక్బరు:—( షైరామునుజూచి ) సచివవర్యా! ఈ ద్రోహులెవరు?

షైరాం:—మహాప్రభూ! వీఁడు ( జోడుపూరు మల్లదేవునిఁజూపి ) మరుదేశంబునందు జోడుపూరు రాజు. మల్లదేవుఁడను యీ ద్రోహినామకు వీఁడు హుమయూను పాదుషాగారికి మిత్రుఁడై యుండి వారిచే ననేక సన్మానములంది, పాదుషాగారు షర్షాచే జయింపబడినతఱిఁ దమ దేశంబున నడుగిడఁగూడదని యాజ్ఞయిడుటయేగాక వారినిఁబట్టి షర్షాకు నప్పగింప యత్నించెను. వీఁడో ( అంబరు బలవంతదాసునిఁజూపి ) ఆ ద్రోహికి సాహాయ్యపడిన మహాద్రోహి. అంబరుదేశపురాజు బలవంతదాసు.

మ. మరుదేశంబున మిత్రులై మిగులసన్మానంబులన్ బాదుషా
దొరచేనందుచు నీదురాత్మకులయో ద్రోహంబుల న్పన్నిరా
ధరణీపాలుఁడు రాజ్యమున్వదలి బాధన్జెందు కాలంబునన్
గరుణన్వీడి వధింపనాజ్ఞయిడుమా కల్యాణముల్బొందుమా.

మహాప్రభూ! అక్కటికముమాని, కటికవృత్తిఁబూని వీరికుత్తుకలు నీకత్తికాహుతియొసఁగుట సర్వజన సమ్మత కార్యంబని నేనెంచెద.

అక్బరు:—( మల్లదేవునిఁజూచి ) ఓరీ ద్రోహీ! మల్లదేవా!

శా. ఓరీ! ద్రోహీ! కులాధమా! కుటిలమాయోపాయ! ఛీ! దుర్మదా!
కారాపుల్బడి రాష్ట్రమున్వదలి నీరాజ్యంబునన్ జేరఁగా
క్రూరాత్మా! హుమయూను నాజనకుఁ జిక్కుల్బెట్ట యత్నించితే
వైరివ్రాతముఁ జేరితే విభునకున్ బన్నంబులన్గూర్చితే.

( ఖానుఖానునుఁజూచి ) సేనాధిపా! వీరిఁగొనిపోయి కారాగృహంబున నుంపుము. )

అబ్దుల్ ఫజుల్:—(లేచి) మహాప్రభూ! సేవకుని విన్నపంబొకటి లాలింతురని వేఁడెద. క్ష్మాపతుల లోకోత్తరాభరణంబు క్షమాబుద్ధియని నిస్సందేహముగఁ బ్రాజ్ఞులు వచించిరి. అపకారికి నుపకారంబు సేయుటయె గొప్పమార్గమని నీతికోవిదులు వక్కాణించిరి కావున వీరిని మీరు మన్నించి యొక గొప్పయుపకారంబొనర్పవలెనని నా కోరిక.

అక్బరు:—మంత్రివర్యా! ఈ ద్రోహులకు నేనే యుపకారంబొనర్పవలెను?

అబ్దుల్ ఫజుల్:—మహాప్రభూ!

చం. మిగులదయన్ నృపాలక! క్షమింపుమవీరిని దండనార్హులే
యగుదురు గానివీరయిన నక్కటికంబును జూల్పుమా మదిన్
బగఁగొనఁ బూనఁగావలదు పార్థివ! వీరియనుంగు బిడ్డలన్
దగునని నీవు జేకొనుమ దాసులుగా హితసూత్రి హెచ్చఁగన్.

మహాప్రభూ! వివాహసంబంధబాంధవ్యబలముచే వీరిరాజ్యాభివృద్ధికిఁ గారణంబగు. మా రాష్ట్ర క్షేమంబున కాధారమగును.

అక్బరు:—మంత్రివరా! నీ వచనములు హితనీతియుతములని నే నెన్నెద.

అబ్దుల్ ఫజల్:—( బలవంతదాసునిఁ జూచి ) తాతా! నా పలికినపలుకు మీకు సమ్మతముకాదా?

బలవంతదాసు:—హా హా. అంతటిభాగ్యమా! ఈ పాదుషాచక్రవర్తి సంబంధముఁ గోరనివారెవరు? మా పెద్దలిట్టి సంబంధముల కింతకుమున్నే మార్గదర్శకులైనవారు. అవశ్యకము నా బిడ్డను చిక్కులాయిని వీరికిచ్చి వివాహమొనర్చెద.

అబ్దుల్ ఫజల్:—అధికధనా లోకానుభవమునుఁగల వయోవృద్ధుల బుద్ధికుశలత. ( మల్లాదేవునిఁజూచి ) మల్లాదేవా! ఈ విషయంబున నీవేమందువు?

మల్లాదేవ:—మంత్రివరా! ఏమిమాటలాడెదవు?

మ. తగునే నీవిట్టి మాటలాడఁగ విచిత్రంబౌఁగదా! హిందువుల్
వగవుం జెందిననేగాని యన్యకులసంబంధంబుఁ గాంక్షింతురే?
నగరే చేతులుదట్టి భూజనులు ప్రాణంబుండు నందాఁక? మే
లగునే యిట్టియమానుషంబు? వలవయ్యా కీడగుం దీనిచే.

హా హా. ఇట్టిమాటలాడఁజెల్లునే? నిజమతావలంబనమతిగదా యార్యావర్తమునందలి భూపతుల భూషణము. మహమ్మదు ఘజనీ, అల్లాయుద్దీన్, టోగ్లాకు మొదలగు పారసీకులు రాజ్యములు జయించి రాజ్యలక్ష్మినిఁ జూఱగొనిరిగాని యీ యార్యావర్తంబునందు స్థిరముగఁ బాదుకొనిన హిందూమతము నిర్మూలము చేయఁజాలరైరి. ఈ శారీర సుఖభోగమునకై చిరకాలార్జిత మతమును దిరస్కరింపనగునే? నాకది సమ్మతముగాదు. ఇట్టిమాటలాడకుఁడు.

బలవంతదాసు:—ఏమీ మల్లాదేవా! ఇటుమాటలాడెదవు?

మ. మలదేవా! వినుమౌర్ఖ్యమున్వలదు సేమంబందె ప్రాణంబునన్
నిలువన్ జూచుట రాజమార్గమగు హానిన్ గూడు వేశైననీ
కలికాలంబునఁ ద్రేతనీతివిధుల న్గామింపఁగాఁ బోలునే?
ఫలమే? శ్రేయమె? సేమమే? హితమె? వాగ్వాదమ్ము వీడీతిగన్.

మిత్రమా! దూరాలోచనపరుఁడవు నీవీరీతిఁ బట్టుఁబట్టిన గలిగెడుమేమి? ఎదిరించినచో ఫలమేమి? అనుకూలగానిచోట క్షేమమధికమని ప్రల్లదంబులాడికొనినఁ బ్రయోజనంబేమి? ఇది మనకు క్షేమమా? మన ప్రజలకు హితమా? మనరాష్ట్రంబునకు శ్రేయమా? మహాభిమానంబున మన మిప్పుడు మువక్రరముఁ బట్టుపట్టితిమిపో మనకిఁగలాభమేమి? మన్ననుండి. మనరాజ్యంబులు క్షీణించును. మనమర్యాద లెటులైనను నిలువవు.

మల్లాదేవి:—తాతా! నీ మాటలు నిజమని నాకిప్పుడు దోఁచెను. ( అబ్దుల్ ఫజలునుజూచి ) మంత్రివర్యా! నాయనుంగుబిడ్డయగు జోధాబీబీ నీ కుమారునకిచ్చి పరిణయమొనర్ప నే సమ్మతించితి.

అబ్దుల్ ఫజల్:—( అక్బరునిఁజూచి ) మహాప్రభూ! వీరిరువురు తమమాటకు సమ్మతించిరి.

అక్బరు:—అటులయిన వీరు తమసుతల నిచటికిఁబిలిపించి పరిణయంబొనర్చునంతవఱకు మననగరమున విడుదలలోదించి వీరినిసత్కరించుచుండుఁడు. ఇతరరాజుల నేఱసయిన మనసేనాధిపతులు పట్టి తెచ్చిరేని వారినిసైతము సత్కరించుచుండుఁడి. [ బైరామునిఁజూచి ] సచివేంద్రా! చిత్తూరు నగరంబు వీరక్షత్రియుల ప్రతాపాలయమని లోకవాదము. అట్టినగరంబు మనముపట్టమేని నా సార్వభౌమపదవికిఁ గొంచముకళలు గల్గును. కావున యీ నగరంబుపై నందెత్త సేన సిద్ధంబుగ నుంపుము.

బైరాం:—మహాప్రభూ! ఆజ్ఞానుసారంబొనర్చెద. ( సేనాధిపతినిఁజూచి ) ఖాన్ ఖానా నీవిప్పుడే చిత్తూరుపై సేనఁగూడి వెడలుము. ఈ రాజులకుఁ బనిసిన యిండ్లు సవరించియుంచుము. పిలిచికొనిపొమ్ము.

[ రాజులతోఁగూడి ఖాన్ ఖాన్ నిష్క్రమించును. ]

అక్బరు:—మంత్రివరా!

కం. సుదినంబీ దినమాద్యను
పదిలంబుగ రాజ్యలక్ష్మి ప్రబలించునిఁకన్
ముదమని మఱియొక విషయము
మదిఁదలఁచితి నీవువినుమ మంత్రివరేణ్యా.

సచివవర్యా! ఇది శుభదినంబుగావున దీనిజ్ఞాపకార్థము "నౌరోజా" యనునామంబున నొకయుత్సవంబు మన్నగరున నెఱపఁదలఁచితి. ఆకాలంబున భరతఖండములోనుండు సమస్త స్త్రీలిచ్చోటికి రావలయును. అస్థళము నాఁడాదినమున వారివారిచే వినోదకర మయిన సంతజరుపఁబడును, పురుషులెవరికి నందుఁ బ్రవేశముండదు. ఇది మీమదికి సమ్మతముగదా?

బైరాం:—మహాప్రభూ! దీనినుండి తమ ఋజుమార్గప్రవర్తనకు దోషారోపణముగల్పింప నాకరమగునని భీతిల్లెద.

అబ్దుల్ ఫజల్:—బైరాం! చక్రవర్తులకట్టి నిందకలుగునా? మనరాజుగారు తలఁచిన మార్గంబుహితమని నాకుఁదోఁచెడు. స్త్రీలందఱొకచోఁగూడినపుడనేకవిషయంబులు మాటలాడుచుందురు. వారిలో రహస్యములు దాఁగవు. కావున వారనేకవిషయములు వెలిపేయుచుండుడు ఆనేకరాజద్రోహములు వారినుండి వెలివడును. అట్టివన్నియు మారువేషంబున్నూని రాజులు వీనులారవినుట రాష్ట్రమునకు క్షేమము. కావుననిది కర్తవ్యంబు.

అక్బరు:—అటులయిన మనమిప్పుడు వెళ్లుదము.

[ నిష్క్రమము. ]

## ద్వి తీ య రం గ ము.

### చి త్తూ రు.

ఉదయసింగు - రవివర్మ - సూర్యసింగు - భాస్కరసేన్ - ప్రభాకరరావు - కమల.

ఉదయ:—సోదరులారా! ఢిల్లీపాదుషాగారు గొప్పసేనఁగూడి మనపురిపై దండు వెడలినారని చారులచే వింటిని. వారికి మేమే తప్పొనర్చి కాసము. మాపురి దౌర్భాగ్యమెట్టిదియో బాపురా ఈపురినెట్టి సమయంబునఁ గట్టించెనో, తెలియదు. షేరుషాహ్‌ని పాలకులందఱుఁ జిత్తూరనిన నెప్పుడెప్పుడు దానిని ముట్టడించి కొల్లఁగొట్టుదుమాయని కాచియుందురు. అల్లాయుద్దీన్ యను పటాణి, సౌందర్య, తారుణ్య లావణ్య ఖనియైన పద్మినీముఖపద్మంబుఁ జూచి నఁజాలుననిద్రోహము లెన్ని మోసములెన్ని యీపురిని నశింపఁజేసెను. మఱల నాతండ్రికాలమున మాళవాధీశుఁడగు బహదూరను వాఁడీపురి ముట్టడించి, రాజవంశజులఁ జంపి రాజస్త్రీలను గాల్చి రాజ్యలక్ష్మిఁ జూఱగొనిపోయెను. తురుష్కుఁడని పేరుండినవాఁడెప్పుడును చిత్తూరుపైఁ గన్నుంచియుండును. ఇప్పుడీ మహాబలాఢ్యుఁడగు నక్బరు మనపురిఁ గాల్పఁ జూచుచున్నవాఁడు. భ్రాతృవరులారా! అక్బరనిన సామాన్యుఁడా?

సీ. బాలుఁడై వైరులగాలంబు ననుచిక్కి
  దైవబలంబున దక్కినాఁడు
యౌవనంబందియుండదనినాఁడియా
  గురువిక్రముని శౌకండరునుబట్టి
క్రూరసత్వంబునఁ దారిలోనెదురైన
  శార్దూలమునుబట్టి సంహరించె
ధీరతమాళవాధీశునినోడించె
  నంబరాధిపునుక్కడఁచి తెచ్చె.

గీ. జోడుతనకెందు లేదనిసొక్కినిక్క
  జోడుపురపతిఁ జెఱఁబట్టి స్రుక్కఁజేసె.
  నట్టిపటువిక్రమాఢ్యుఁడై యవనినేలు
  నక్బరుని నోర్వఁగ మాకునగునె? వలదు.

కావున మనమాయక్బరుగారితో యుద్ధముసలుపక చెలిమిఁజేసి యీ నిర్భాగ్యపురినివదలి యుదయపురమునకుఁబోవ్ఛదము— ఇదిమీకు సమ్మతముగదా?

రవివర్మ:—ఏమీ! ఏమిమాటలాడెదవు? వైరితో యుద్ధముసలుపరాదా? చిత్తూరువదలవలెనా? ప్రాణంబులు తీపని దాఁపవలెనా? మనము క్షత్రియులము కామా? రాజసగుణంబు మనయందుఁదగ్గెనా. పౌరుషము మనయందు దగ్గెనా? యుద్ధమునినమూపురములు పూఁడగు మేము వైరులచేరు

వినినమాత్రమున భాగ్యయుండమా? బాప్పరాజ వంశస్థులింకనువిగిరని మహాస్త్రా పగఁజెం దరా? ఆడులు చేతులుదట్టినగరా?

శా. ఏమీ! క్షత్రియవంశదూషణ! భళా! యీశూరవంశోద్భవుల్
భామాసంఘముతో లెనుండఁగలరే వైరుల్మదింపన్? గుల
క్షేమంబైనను నెన్నఁగావలదె? సుశ్రేయస్కరంబైన యీ
భూమిన్ మేనునఁ జాయఁగాఁగలరె? బాప్పారాజవంశస్థులై.

చాలు చాలిట్టిమాటలాడకు. సేవనఁజాలం.

సూర్యసింగు:— ఏమీ! ఉదయసింగు! క్షత్రియకులోద్భవుఁడగు నీవీరీతిమాటలాడనగునా? అక్బరు నామంబు నీస్థైర్యోచ్చాటనమంత్రమాయెనా? ఈ భీతినీయందుంచినవారెవరు? సింగరాజు పుత్రుడిట్టి పిఱికిమాటలాడెనని జనులువినిన నీజననమూలంబు సందియింతురుగదా? ఇఁక నీవిట్టిమాటలాడకు.

శా. ధీరుండైజగమేలఁగాంచెను శిలాదిత్యుండు; బాలుండు తా
వీరుండై జగతిన్ జయించెను గుహాఖ్యా విఖ్యాతనాముండు భీ
మారివ్రాతమునుక్కడంచుచు యశంబార్జించి కట్టించె బా
ప్పారాజీపురి! దీనిఁ బాయనగునే భూమీశ ప్రాణంబునన్.

భాస్కరసేన్:—ఉదయసింగు! నీవెంతటిపిచ్చిమాటలాడితివి? శత్రువుచేతనన్న సంధికోయట క్షత్రియ ధర్మమా? క్షత్రియస్త్రీలకు నైతమింతటి పిఱికితనంబు పుట్టదుకదా? నీవింతటిదుర్బలుఁడవని యీ పాదుషా తెలిసినచో క్షత్రియ స్త్రీలనంతఃపురమునఁదన కప్పగింపవలెనని యాజ్ఞయిడును. అటుచేయుసమ్మతియా?

కం. వెడమాటలాడ వలదిఁకఁ
పోడువగు మనబలముఁ జేర్చి పోరుమ జయమున్
బడయుము! క్షాత్రియధర్మముఁ
జెడనటులోనరించి యశముఁజేకొనుము! వడిన్.

ప్రభాకరరావు:— హా! హా! ఉదయసింగు! నీకీపురిపై నించుకైన నభిమానంబు లేదుకదా? ఈ పురివదలి పోనగునని యెంతసులభముగ మాటలాడితివి? నీజననమూలంబు నీమాటలు వెలివేయుచున్నవి. ఇక భీరుచేఁ జంపఁబడినవాఁడు సింగరాజపుత్రుఁడగును కాని దాసీపుత్రుఁడు కాడని యిపుడు స్పష్టమగుచున్నది. తనపుత్రుఁడగు నిన్ను రాజును జేయఁదలంచి దాసిమమ్ము మోసగించెను.

కం. మోసం దేహముఁదిత్తెను
దాసీపుత్రునకు నేల ధైర్యము కలుగున్?
మోసంబయొఁగులమునకును
దాసియువన్నె యనువఱిగె, వాఁటిలెనిందల్.

మిత్రులారా! రాజనియోగకులాఘముని ముఖావలోకనము సేయుట పాతకహేతుకంబు. కుల టతో మదనోత్సవ మింపగునట్టుల వీనిమానసమునకు పైదుబలోరణోత్సవ మింపుగా లేదు. మనము వీనిని నూడిరణమొనర్ప నలవికాదు. రండు వెళ్లుదము.

(ఉదయసింగు తప్ప నందఱు నిష్క్రమింతురు.)

ఉదయసింగు:— అయ్యో! ఈ దురాత్మకులకు నాహితమ్ము విషమయ్యెఁగదా? నన్నెన్ని మాటలాడిరి? సమయము కాదని మిన్నకయుంటిని. కానిచో వీరి కంఠంబులు తుండ్లతుండ్లుగా ఖండింపనా?

ఉ. భుజబలగర్వయుక్తులయి భూపతి నేనని యైన మన్నకీ
కుజనులు నోరుకుళ్లఁగను కుత్సితముల్ప్రచరించిరక్కటా!
నిజము నెఱుంగరైరి, రణనీరధిముందు నెదుర్వేళ్లైన భూ
భుజుఁడు యథార్థమౌ డెందని పొక్కి తలంతురు నాహితంబునన్,

(చింతించుచుండును.)

(కమల ప్రవేశము)

కమల:— (తలవంచికొనియున్న రాజునిఁజూచి) ఏమి యీ యాశ్చర్యము? నేనుఁజూచిన క్షణముననే లేచివచ్చి కరుణించి కౌగలించి లాలించి సరసాలాపములాడకయీ మోహనాంగుఁ డిట్టు చింతాసరితికి సాంతమంతయు నప్పగించి యేమియుం దెలియకయున్నవాఁడు? ఇదియే మోరాజకార్యాలోచనముగనున్నయది. మాటలాడించి చూచెద. (సరసఁజేరి) మోహనాంగా! ఇంతటిదీర్ఘాలోచన పరుఁడవై యథోలోకావలోకనము సేయుచు నెదుటవచ్చిన నన్ను మాటలాడింపక మౌనముద్రను ధరించినావు? అంతటి కార్యమేమి తటస్థించెను?

ఉదయసింగు:— (నిట్టూర్పు పారించుచు) మోహనాంగీ! ఈ యవమానకరమైన వార్త నేనేమని తెలుపుదును? నామానసంబు పరిభవకీలలోఁ బడి కాలుచున్నయది.

కమల:— ప్రాణప్రియా! అంతటి యవమానం బెవరినుండి కలిగెను?

ఉదయసింగు:— ప్రేయసీ! నాజ్ఞాతులు నా సేనాధిపతులు నన్నె ధిక్కరించి కులహీనుఁడవి కుత్సితములాడి నా మానసం బెల్లఁ గలంచిరి. చేయునది లేక మ్రోడ్పడినమానువలె నూరకయుంటిని.

కమల:— మోహనాంగా! ఏవిషయంబున నింతటి వాగ్వాదంబు కలిగెను?

ఉదయసింగు:— నాతీ! ఢిల్లీపాదుషా భూరిబలయుక్తుఁడై వారిపై దండెత్తినాఁడట. ఇప్పటిస్థితిగతుల నాలోచించి యుద్ధము వదలి పాదుషాతోఁ జెలిమిఁ గాంక్షింప వలెనని యాడితి. ఆమాటలకు ద్రోహులాగ్రహపడి, నోటికవచ్చినట్లు దిట్టి నాముఖావలోకనము పాపమని కూసి వెళ్లిపోయిరి. యత్నము మీఱి మిన్నకయున్నవాఁడను.

కమల:— మోహనాంగా! వారియెదుట నీవు త్వరపడి నీ యభిప్రాయంబు వెలిబుచ్చితివి కాఁబోలు. మంచిది. ప్రాణేశా! నీ మనంబున కహితంబుగ మాటలాడితినేయని నాపైఁ గినియక నను మన్నింపుమని వేఁడెద. ఆ కానము ఘరానరులకు శుభావహము, కావున రణమువలదనుట

రాజధర్మముగాదు. పారశీకులబలముకన్న మనబలము హెచ్చుగనున్నయది. అంతకు నతిశయముగ మనకుస్థానబలమున్నయది. ప్రాణరక్షణమునకై పోరువారువైరులు. మన మంతయేగాక జననావనీ యభిమానంబునఁ బోరువారము. ఇచ్చటి దుర్గమస్థలంబరుల కగోచరంబులు మనకో కరతలామలకంబులు. కావున జయము మనదగుననుట నిస్సందేహము.

ఉదయసింగు:— మోహనాంగీ! నీమాటలు నాకలఁతలుదీర్చి కలనికి నా మానసంబును బ్రోత్సాహపఱచెను ఇదికదా నీసామర్థ్యము.

కమల:— మోహనాంగా! నాపైఁ మీకుఁగల ప్రేమాతిశయంబున మీరు నన్నిటు పొగడుచున్నవారు. ప్రాణప్రియా! నాకు మఱియొక కోరికకలదు. మీరేమనికొందురోయని భీతిల్లుచున్నదానను.

ఉదయసింగు:— నాతీ! భీతియేల? నిర్భీతిగఁ బలుకుము.

కమల:— మోహనాంగా!

చ. దురమును జూడనామదిఁ గుతూహలమున్నదికాన, నేనుమీ
సరసను నిల్వనాజ్ఞయిడి సత్కృపఁ బ్రోతు రటంచు వేఁడెదన్
కరిగమనల్ రణావనికి గర్హ్యలటంచని యెంతురేని మీ
పురుషుల దుస్తులన్ దొడఁగిపొందుగ నుండెద మీమఱుంగునన్.

మహాప్రభూ! ఇదియనాకోరిక.

ఉదయసింగు:— మోహనాంగీ! రమణులెక్కడ రణమెక్కడ? అంగనలు కుసుమకోమలాంగులు. రణము వైరివారశరజాల భీకరాంగణము. కావున నినుఁబోలు వనబోణులు రణభూమి నిలువఁజాలరని సందియించెద.

కమల:— ప్రాణకాంతా! నీ ప్రియురాలంతటి పిరికికాదు. నీకేసందేహమువలదు.

ఉదయసింగు:— మోహనాంగీ! అట్లైన పురుషరూపంబుదాల్చి నావెంటనుండుము. పోవుదమురమ్మా.

[ నిష్క్రమము. ]

## తృతీయరంగము.

చిత్తూరు యుద్ధము.

హిందూ మహమ్మదన్ సేన.

మహమ్మదన్ సేనపఱుగిడుట.

---

## తురీయరంగము.

చిత్తూరు.

రామసింగు - లక్ష్మణసింగు.

రామసింగు:— లక్ష్మణసింగు! ఆ తురుష్కులను నిర్ధూమధాములుగ నొనరించితిమి. ఆ పారసీకులు తోఁకలుముడిచికొని పఱిగిరి.

లక్ష్మణసింగు:—అవును రామసింగు! ఆ యవనాధములుక్కు మీఱి, పూనేనదాఁకె, చెక్కుచెండాడుచుండ, నొక్కపేడిమూతిబాలుఁడు మనదొరగారి ప్రక్కనుండి లేచి విజృంభించి, యభిమన్యునివలె శాత్రవమండలిఁ జొచ్చి, చిక్కినవారినిఁ జిక్కినట్లెల్లఁ జెక్కి, దిక్కుకొకరు పఱుగిడులాగొనరించెను. వాఁడెవఁడౌను?

రామసింగు:—లక్ష్మణసింగు! అచ్చెరువంది ఱిచ్చవడినిలిచి యాచిన్నవాని మొగ మెగాదిగఁ జూచితిని. మరలఁజూచితిని. మఱిమఱి పలుమారుచూచితిని. నాకేమో సందియముగనున్నది.

లక్ష్మణసింగు:— అదియేమయా నీ సందియము?

రామసింగు:—ఆ బాలుని మోముపై నాడుఁగలచాయయున్నది. నడకనైత మటులనేయున్నది.

లక్ష్మణసింగు:—అటులయినఁ బురుషరూపమునుధరించిన స్త్రీయనియా నీ తాత్పర్యము?

రామసింగు:—అవునయా! నిజము.

లక్ష్మణసింగు:— ఆటులైన యా స్త్రీ యెవతెయౌను?

రామసింగు:—అదియనాకు సందియముగనున్నది. మెఱుపువలెనించుక ప్రజ్వలించి మరల నారాజునుని మఱుఁగుఁ జేరెను.

లక్ష్మణసింగు:—అది మారాజుగారి లంజ కమలాంబయౌను నా?

రామసింగు,— అవునయా! అవును. నిస్సందేహమిది. నాకుఁదోఁపకపోయెను. ఇతర స్త్రీ కంతటి తెగువ కలుగునా? చిన్ననాటినుండి కత్తిపై సాముచేసిన యాటకత్తెయది. తరుణి తెగించి నిలిచినతఱిఁ బురుషులు దానికెదురై నిలుతురా?

లక్ష్మణసింగు:—నిజము. ఈదినమున రాజాస్థానమున సేనాధిపతులు చేరుదురు. మనముపోయి చూచి వత్తమురమ్ము.

[ నిష్క్రమము. ]

పంచమరంగము - చిత్తూరు.

ఉదయసింగు - కమల - రవివర్మ - మొదలగు సేనాధిపతులు.

రవివర్మ:—మహాప్రభూ!

చం. యవనులు కాందిశీకుల యిర్వాజియు నాశయుమాని; కాళ్లకుఁ
జవనవిశేషనై పుణినిఁజయ్య నసేర్పుచు, శైలవాటికిల్
భవనముగాఁ గుదుర్చుకొనఁ బాఱుచు, మాకుయశోధనం బునుఁ
సవరుగనిచ్చి చింతయను చానను బొందిరి దుర్యశంబుతోఁ.

ఇట్టి పరాక్రమవంతులు రణధీరులు మేమిందఱు మేమున నిచటనుండ ఖండనమ్ము వలదని వదలి దుష్కీర్తిఁ దెచ్చికొనుచుంటిమిగదా! మనపాలిదైవ మెంతటియవమానమునుండి మముఁ దప్పించెను.



# ప్రతాపాగ్బరీయము.

## ద్వితీయాంకము - ప్రథమరంగము

చిత్తూరు.

" కాళి "

కాళి:— హా హా దాహముఁబాపెద యీపురి నేనుండనే? ఈపట్టణంబునాశ్రయించి యెన్నివర్షంబుల రయ్యెను? అనిర్భాగ్యుండు పయసింగు తన జనకభూమిపై కీర్తిమానంబుమాని పిరికివాఁడగు తన పుత్రులతోనుదయ పురిఁ జేరెను. రాజతనయులరక్తమును పానీయముగ నొకప్పుడొసఁగిన నేనీకోటఁ గాచుచుండెద నని బాప్పరాజునకు మాటనిచ్చియుంటిని. ఇప్పుడు రాజపుత్రు లేరీ? వారిరక్తమేదీ?

సీ. రాచకుమారుల రక్తమిచ్చిన నేను
కోటఁ గాచెదనని పూటవడితి
అలియుద్దీనుని యాహవంబున రాజ
తనయులరుధిరముఁ ద్రావఁగంటి
బహదూరుఁడొనరించు భండనమ్మున
ధరాధవుల శోణితమెల్లఁ ద్రావఁగలిగె
రాజులేదయ్యెఁ గారాణింపఁగా నేఁడు
దాహమయ్యెడు నీకఁ బడయలేను
గీ. ఆర్యులను నేఁడు నేపీడి యన్యమతము
వారిపురములఁ జేరుచు వారిఁబోలె
శూరులగువారి క్షతజమవారిగాను
ద్రావి తనియుదు, వేఱొకదారిఁ గాన.

అయ్యో! ఈకోటపైవసతిఁ జేసికొని యెన్నిశతాబ్దములుంటిని. నాతృప్తికై రాణిగారలు నాఁడు తనకొమారులను పండ్రెండుగురికి పట్టముఁగట్టి గాదె బలిగనిచ్చిరిగదా? వారిరుధిరము ద్రావిగదా ద్విసహస్రక్షత్రియాంగనలచితికతంబున గలిగిన నా దాహమార్చికొంటిని. మరలఁ గొన్ని దినంబు లుపవాసంబు జేసి మాళవాధీశుఁడగు బహదూరుఁడు డెత్తినపుడు, నాలుగువేల స్త్రీలు కాలిన పెనుమంటల దాహము హిందూరాజుల రక్తపానీయమున నార్చికొంటిని. అన్పటు పాదుషాయీతూరి యీపురి నినశింపజేయును. అక్కాలంబున క్షత్రియ స్త్రీలనేకులు తమ

పద్మిని లోకోత్తర సౌందర్యవతియని యెన్ని అల్లాయుద్దీ[illegible]
మనపూర్వీకులనెల్లరఁజంపి యాసతీమణినిఁ గొనిపోవఁ బురముఁ బ్రవేశించెను. పద్మిని పురం
ధ్రీమణి కావున క్షత్రియాంగనలకెల్లరకు మానాభిరక్షణ మార్గము బోధించి చితి నేర్పఱిచి
వారితోఁగూడఁ దానునుఁబడి సద్గతినందెను. క్షత్రియాంగనల మానము కాపాడెను.
క్షత్రియస్త్రీల పాతివ్రత్యము స్థాపించెను క్షత్రియవనితఁ తెగువ భూతలమున నెగడు
లాగొనరించెను. క్షత్రియతరుణులు తమగౌరవంబు రక్షించికొను మార్గ మిట్టిదియని మార్గ
దర్శకురాలయ్యెను. ఇది సంభవించి మూడువందల వర్షంబులయ్యెను. మరల యిప్పటికి
ముప్పదికొండ్లక్రిందట బహదూర్షునుండీపురి నశింపఁజేయఁబడినప్పుడు మనరాణి కమలావతి
పదుమూడువేల క్షత్రియాంగనలఁగూడి యగ్నిప్రవేశమొనరించి మనజాతిమర్యాదఁగాపా
డెను. సోదరీమణులారా! ప్రస్తుతము మనకంతకంటె హెచ్చుగహీనస్థితి సంభవించుతటి
తటస్థించినదికావున మీరెల్లరు నేకభావముగలవారై పావకునకు నాహుతియగుటకు
సిద్ధపడియుండవలెను హా!

చం. పరసతులార! వీరవరపత్నులారా! విరోధులీపురిన్
బోరఁబడి సర్వసంపదలఁ జూఱకొని మమ్ముహరించి, యక్కటా!
పరిభవమందఁ జేయుదురు పాడిదొఱఁగుచుఁ గానయిత్తఱిన్
బరసుఖముల్ దలంచి మనపద్మినిఁ బోలఁగ మీకుఁ జెల్లదే?

కుముదిని:— మాతా! పతిపోవు పథమనుసరించిన సతికదా పతివ్రత. పతిరణక్షితిసద్గతినందినతటి, సతి, చితినంది సద్గతిఁ జెందుట సహజముగదా?

కం. పతివరగతి నందినతటి
సతి చితినందుటయ కాదె సద్గతి క్షితిలో!
పతిఁబాసి క్షితిని నిలిచెడి
సతిసతియే? చలనసహిత శవమగుఁగాదే.

మాతా! అట్టి పద్ధతి సంభవించినసమయమున, కిలికిలందత్తమగు మా శరీరమాంస పచన సంబంధపరిమళంబు శాత్రవులు పవనబలపశంబున మూర్కొందురుగాని మాసుఖమైనఁ గాంచఁజాలుదురా? అట్టిసందేహంబు మీకుఁ లదు. నిర్భీతిని మనపురుషులు వైరులను ద్రుంచి జయలక్ష్మినందినిమ్ము. కానిచో ముక్తిరమావతులుగానిమ్ము.

కైమాదేవి:— సోదరీమణులారా! అటులైనఁ జితిసిద్ధపఱచియుండెద కోటవాకిలికేఁగి మనవారు యుద్ధమొనర్చుచు వైరులు ప్రకీలోఁకొరఁబడు సూచన మీరుగవిన క్షణమునకై మీరా మారణకర్మంబొనర్చి మానవులుగాపాడికొనుఁడి. నాకుఁ జేయఁదగినదని విశేషముగ నున్నయది కేఁ బోయివచ్చెద.

ఇతరస్త్రీలు:— మేమును సిద్ధమము.

(నిష్క్రమణము.)

జగదేవ:— అన్నా! నా చిన్నతనంబొకటి మన్నించి యిందువలన విషయవిశేషయుక్తైఁ వేఁడికొనెదను. నేను పుత్రహీనుఁడను. "అపుత్రస్యగతిర్నాస్తి" యనువచనంబు నామానసంబెల్ల కాలంబునఁగలంచుచుండును. కావున నీవీసుస్థ్రాతమున్నించి నాకు వానిని పుత్రభిక్షగనిడిరివేని వానిఁజూచి సుఖమునసుండెద.

ఉ. సోదరనిన్ను వేఁడెదను సుక్షుని నేఁ గొనిపోయి పుత్రుఁగా
నాదరమొప్పఁ బ్రోవమది నాశజనించెను పుత్రహీను నా
సోదరతన్మ మనస్సుఖము సమ్మతినీసుతుఁ బుత్రభిక్షగా
మోదమొసంగ నాకిదుఖ మ్రొక్కెద నీకి దైవన్నుఁ బ్రోవుమా.

[ అనుచు మ్రొక్కును. ]

ఉదయసింగు:— జగదేవా! నీకేల యీ పుత్రేషణ? గర్భమునఁబుట్టి తలిదండ్రులచేఁ బెంపఁబడిన సుతులు హీనమతులయి కృతఘ్నతఁబొంద్చి తలిదండ్రులనెదిరించి వారి మానసంబు కలంచుచుందురు. పుత్రహీనులకుఁ బుత్రులు లేరను దుఃఖంబొకటితప్ప మరియేదియు వారిని బాధింపదు ఇదినిజము. నీవన్నియు నెఱింగియు నీపుత్రభ్రాంతి నీకుఁగలదేని యీ దురాత్మకునిఁ గొనిపోయి రక్షించుకొనుము. ఇపుడే నానుండి వానిఁదీసికొనిపొమ్ము. కృతఘ్నుఁడువీఁడు కావున వీనిముఖావలోకనము నేఁ జేయనోప.

జగదేవ:— [ నమస్కరించి సుజ్ఞానుఁబిలిచికొని నిష్క్రమించును. ]

ఉదయసింగు:— ఈ నా పుత్రులు మూర్ఖులయిరి. ఇప్పటిస్థితిలో వీరు నా రాజ్యమేల సమర్థులుకారు. నాకు వార్ధకము సంభవించెను. ఈ రాజ్యంబెటునిలుచునో తెలియకయున్నది. చింతించి ప్రయోజనంబేమి?

[ నిష్క్రమణము. ]

## ద్వితీయరంగము.

### ఉదయపురము - రాజగృహము.

### ఉదయసింగు - శ్యామలాంబ.

( ఉదయసింగు జ్వరార్తుఁడై మంచముపైఁ బరుండియుండును. సరసశ్యామలాంబ కూర్చుని )

శ్యామలాంబ:— దైవమా! నా మనోనాయకుని రీతి బాధించిన నాగతి యేమి?

ఉ. దైవమ! యీ ధరాధరుని దార్ఢ్యము తగ్గగ సాగె నింక నే
నేవిధి నోర్తు ప్రాణమున నీ భువి నిల్పఁగ? దిక్కు లేదు దీ
నావన! ప్రోవవే పతి ననామయుఁ జేయుచు దీనయైన నన్
గానవె కంఠసూత్రమును గాచి కృపావతి! మ్రొక్కి వేఁడెదన్.

ఉదయసింగు:— (కన్నులు తెఱచి) ప్రేయసీ! కన్నీరు గార్చెదవేల? ఊఱడిల్లుము. జననమరణాదు లేరికిఁ దప్పినవి కావు. నీవిటు దుఃఖించినఁ బ్రయోజనం బేమి?

శ్యామలాంబ:— నాథా! ముందు నాకెవరు దిక్కు? నే ననాథనయ్యెదనే యని చింతించెద.

చం. నను విడి నీవు పోయినను నా గతి యేమి? యనాథనైన నన్
గని యిటు రమ్మటంచుఁ బలుకన్ క్షితి లేరొకరైన నెట్టులీ
తనయుఁడు జ్ఞాతివర్గమున దక్కను జీవితుఁడై? నృపాలకా!
కనికరముం దలంచి యొక కార్యము సేయఁగ నిన్ను వేఁడెదన్.

ప్రాణపతీ! దైవవశాత్తీ కాలంబున నీకుఁ బరలోకప్రాప్తి కలిగెనేని యీ లోకమున నీ ముద్దుల కొమారుని జగ్గమల్లును మాటలాడించువారెవరు? జ్ఞాతివర్గమున వాఁడెటు తలయెత్తును? "జ్ఞాతిశ్ఛేదన లేనికి" యనునది తప్పగునా? మీ వాఁడు రాజకుమారుఁడా యువరాజమునకై తగఁ గలఁడా? నాథా! ప్రాణపతీ! మనోనాయకా! దీనురాలి మొఱవిని కరుణఁ బూని నీ రాజ్యమునకుఁ బట్టంబు నా పట్టికిఁ గట్టునట్లు లాజ్ఞయిమ్ము. దీనికై నిను వేఁడెద.

ఉదయసింగు:— శ్యామలా! ఊఱడిల్లుము. చింతింపవలదు. నీ కోరిక సఫలంబుఁ జేయ సర్వప్రయత్నంబు సలిపెద. మన జగ్గమల్లు రాజ్యంబు దక్కించుకొనుట కష్టసాధ్యంబగును. ప్రతాపుఁడు ప్రతిమప్రతాపుఁడు కావున నా యనంతరము వానినాదరించువారుందురు. అయినను నా సచివవరులనాలోచించి కాఁదగిన కార్యంబు సలుపులాగొనరించెద నీవు పొమ్ము.

(నిష్క్రమణము.)

## తృతీయరంగము.

### ఉదయపురము.

### రామసింగు - లక్ష్మణసింగు.

లక్ష్మణసింగు:— అన్నా! నిన్నరాత్రి వివాదమేరీతిఁ బరిష్కరింపఁబడెను?

రామసింగు:— వివాదాంశము వివాదములోనే నిలిచినది. లోకములో లేని సంగతి జరుగవలెననిన నెవరొప్పెత్తురు? జగ్గమల్లునకుఁ బట్టంబుగట్టవలెనని యుదయసింగుగారు తమ మరణసమయంబునఁ బలికిరఁట. అంతమాత్రమున వంశపద్ధతిని ధిక్కరించి మనవారు ప్రతాపుఁ గాదని జగ్గమల్లునకుఁ బట్టంబుఁగట్ట సమ్మతింతురా?

లక్ష్మణసింగు:—అటులైన జగమల్లుపని తుదముట్టినట్టే కదా?

రామసింగు:—మాటమాత్రమునఁ గార్యము ముగియునా? వాఁడయినను వెలివాడ లేక యుండునా? ఉన్నారుకదా మనవారు కొందఱు, లోలోఁగా జగడము బెట్టి కన్నులఁ జూచుచుండువారు. జగ్గమల్లు తల్లిదిక్కువారు కొందఱువచ్చియున్నవారు. వారిలో మనవారు కొందఱు చేరినారు. నేఁడు ప్రతాపునకుఁ బట్టంబుగట్టఁబడును. అందఱు రావలయునని ప్రతాపుని పక్షము నవలంబించినవారు చాటింప నాజ్ఞయిచ్చినారు. అదేరీతిగ జగ్గమల్లువిషయంబు చాటింప వానిదిక్కువారాజ్ఞ యిచ్చినారు. ముఖ్యము సంతోష సమయంబుననైనను సంగరంబు సంభవిల్లునని తోఁచెడి.

లక్ష్మణసింగు:—ఎవరేదిక్కుననుండిరి? ప్రతాపుఁడు రాజ్యము నేలువాఁడుకాఁడు. వాఁడెదురుపడి నిలిచినపుడు వీరానిలుచువారు? సింహమెక్కడ? బక్కనక్కయెక్కడ? ప్రతాపుఁడు రాజయిన క్షత్రియుల పౌరుషమువక్కను. జగ్‌మల్లు రాజయిన క్షత్రియులకు నిండ్లు వాకిండ్లు దక్కను.

రామసింగు:—ఎవరికేమిదక్కినను మనకేమో సేవకవృత్తి తప్పదు కదా? ఈ యధికప్రసంగములు మనకేల? రామాయస్వస్తి. రావణాయస్వస్తి యనుచు నుందము. ఎవరు రాజయిన వారినిఁ గొలుతము. నిజమా? కాదా?

లక్ష్మణసింగు:—నిజము. నిజము. ప్రొద్దుపోవుచున్నది. మామా పనులకుఁ బోవుదము రమ్ము.

(నిష్క్రమణము.)

## తురీయరంగము.

### ఉదయపురము - ఆస్థానమంటపము.

ప్రతాపుఁడు-జగ్‌మల్లు-పురోహితులు-రామభట్టు-లక్ష్మణభట్టు - కుబేరసేన
జయదేవ - భీమజీ- శేషజీ - కృష్ణసింగు - దౌలతుసింగు - సర్దార్ సింగు.
బలవత్ సింగు - విక్రమసింగు.

[సింహాసనము మధ్యనుంచి కుడిప్రక్కనప్రతాపుసింగు పక్షమవలంబించినవారును యెడమప్రక్కన జగ్గమల్లుపక్షమవలంబించినవారును గూర్చునియుందురు.]

లక్ష్మణభట్టు:—(లేచి) సభాసదులారా! సుముహూర్తంబు మీఱుచున్నయది. ఆలస్యమేల? ఉదయసింగుగారి మరణశాసనము రీతి మనజగ్గమల్లునకుఁ బట్టంబుగట్టుదము. పట్టంబుగట్టు వఱకు రాజుగారి శవసంస్కారమునకు మార్గము లేక యుండును.

(జగ్‌మల్లుని జూచి)

కం. లెమ్మా జగ్గమల్లు! తిలకము
గొమ్మా ఫాలమున నుంచికొమ్మా యానం

దమ్మున సింహాసనమున
రమ్మా యెక్కింతు మనము రంజిల్లంగన్.

జగ్మల్లు! ఆలస్యమేల? లెమ్ము.

రామభట్టు:—ఏమీ! లక్ష్మణభట్టు! నీ వెవఁడవు. రాజపురోహితుఁడనై నేనిచటనుండ నీవా రాజును జేయువాఁడవు? ఔరా! గర్వము; ఈ రాజ్యమునకు జగమల్లెవరు? శునకము కనకసింహాసనంబునకుఁదగునా? రాజునకుఁ బెద్దకొమారుఁడు వీరప్రతాపుఁడై ప్రతాపుఁడుండ, వానినిఁగాదని సింహాసనంబుగొనువారెవరు? సింగమునోటఁబడిన యామిషంబుఁ గరిశాబకంబుకొనఁజాలునా? తరుణికిలోఁబడి ధరణీపాలుఁడు మరణశాసనంబు వ్రాసినమాత్రాన తరణివంశసరణి తప్పఁగునా? ఏలయీ వడమాటలు?

(ప్రతాపునిఁ జూచి) రాజకులప్రతాపోద్దీనా! క్షత్రియాన్వయప్రదీపా! వీరప్రతాపా! ప్రతాపా! లెమ్మా.

కం. లెమ్మా! ప్రతాప! తిలకము
గొమ్మా ఫాలమున నుంచికొమ్మా! యానం
దమ్మున సింహాసనమున
రమ్మా యెక్కింతు మనము రంజిల్లంగన్.

ప్రతాపా! లెమ్ము. ముహూర్తంబు మీఱును.

దౌలతుసింగు:—(లేచి) ఏమీ! బ్రాహ్మణా! జగమేలఁజాలు జగ్మల్లు మీవారు రాజ్యమేలఁజాలఁడా? వాఁడు క్షత్రియుఁడు కాఁడా? రాజపుత్రుఁడు కాఁడా? రాజుగారి మరణశాసనంబు దిరస్కరింపనగునా? ఇది హితబుద్ధి కాదు. అధికప్రసంగములుమాని మానితమ్ముగ జగ్గమల్లునకుఁ బట్టంబుగట్టనిమ్ము.

ప్రతాపసింగు:—(కోపమున లేచి) ఏమీ! క్షత్రియాధమా!

శా. ఏమీ! క్షత్రియ! యేమిమాటలివి? యేకీ కాంతునీ వెట్లు లో
మామూవాదము: దీర్ఘవో తెలుపుమా మాన్యుండవై లేని? యీ
నామాన్యంబును నాకుఁగాదనుచు భూనాథుఁడు తాఁబల్కఁగా
నేనా నన్ గలవాఁడనే! కరమునన్ నేఁబూననే కత్తియున్.

జగ్గమల్లు—(లేచి కోపమున)

శా. వాలున్ బూనిన వాఁడునీవొకఁడవా! వహ్వా! యిటుల బెట్టుగా
చాలున్ జాలును పోటువాక్యముల రాజ్యంబేలఁ గాఁజాలదే?
మేలా నీబలె క్షత్రియాన్వయమునన్ మే మంతవారంబుట్టమే?
రాలన్ రువ్విన మాత్ర రాజ్యమెటులన్ రాలున్? ప్రతాపాసనా.

ప్రతాపా! నీప్రల్లదంబులు చాలింక. మఱతంత్రి మరణశాసనమునకే నేనురాజును. అధికా
దన నెవరివశంబు గాదు. ఈ సింహాసనాధిష్ఠానము రాజచిహ్నముకావున దానికి నేనర్హుండను.
నీవీరీతి వృథా కలహంబుఁ బెంచకు.

ప్రతాపుఁడు:—జగ్గమల్లు! భుజబలంబు లేనివానికి మరణశాసనంబు మరణమని తెలియుము. మరణశాసనబలముచే నీవు రాజువయితేని యీ కృపాణధారాబలమున నీకు మరణంబు గల్పించి నే రాజునగుదును. ఏదీ! చూచెద. నా కెవరడ్డపడెదరో? (అని సింహాసనమెక్కఁబోవు)

(జగ్గమల్లు నతనిపక్షమువారును లేచి కరవాలము లెత్తుదురు. ప్రతాపుని దిక్కువారు వారి నెదిరింతురు.)

కుబేరసేనుఁడు:—రాజపుత్రులారా! క్షత్రియకులోత్తములారా! మీమీ కలహంబులు మానుఁడీ. కులాగతధర్మంబుఁ బూనుఁడీ. ప్రస్తుతస్థితిగతులు నాలోచింపుఁడీ. వృథాకలహములు చేయకుఁడీ. రాజుగారు వృద్ధులై తమరాణిగారి దుఃఖంబుఁ జూడఁజాలక వారియాటలకై మరణశాసనంబు వ్రాసిరి. అయినను కులాగతన్యాయసరణిఁ దప్పింప వారివశము గాదు. ఈ ధరణి క్షత్రియకులసంభవులకెల్లరకుఁ జెందినది కాని యొకరిసొమ్ము కాదు. క్షత్రియులు భుజబలాభరణులు. భుజబలాఢ్యులు సింహాసనార్హులు. సింహాసనార్హుల నే జనులు రాజుగ నియమించుకొందురు. విశేషజననియామితాధికారమే రాజత్వము. ప్రస్తుతస్థితిగతు లెల్ల నాలోచించి వీరప్రతాపుఁడగు ప్రతాపుఁడే రాజ్యమేల సమర్థుఁడని జనులెల్లరు నిర్ధరించినారు. తమనిర్ధారణము రణమునఁ బ్రాణములకైన సరకుసేయక స్థాపింప యత్నించినారు. పారసీకుల ప్రాబల్యకాలమున మనమిటు కలహించుచుండిననో మన నాశనమునకు మనమే మార్గదర్శకులగుదుము. మీరందఱు దీర్ఘాలోచన యతకుసుగా కార్యాభిమానంబుమానక క్షత్రియకులాభిమానంబు నేమఱక రాజ్యాభివృద్ధికై పాటుపడెదరని వృద్ధక్షత్రియుఁడగు నేను మిమ్ము మనఃపూర్తిగ వేఁడుకొనియెద.

[జగ్గమల్లు పక్షమవలంబించినవారందఱు కుబేరసేనునిపైఁ గల గౌరవంబున కరవాలములు [illegible] కొనుచుఁ గూర్చుండురు.]

జగ్గమల్లు:—క్షత్రియసోదరులారా! మీరు రాజ్యకార్యాభిమానులుగాక తదాజ్ఞోల్లంఘన మొనరించితిరి కావున మీ సరస నేనుండను. ఈ దురాత్ముఁడు ప్రతాపుఁడెట్లు తనరాజ్యము నిలుపుకొనునో చూచెద.

ఉ. పాడిదొఱంగి రాజహితవాక్యము తుచ్ఛముగాను జూచి యీ
నాఁడు ధరాధిపత్యమును నాకునొసంగక విక్రమార్కుఁడే
నాడు భరింప యోగ్యుఁడని నానయు విడుచునాడ నోస! కా
పాడుదురే మొఘాచెవను పాడుతురుష్కులనుండి, రాజ్యమున్.

[అనుచుఁ గోపమున లేచిపోవును]

కుబేరసేన:—సోదరులారా! ఇఁకఁ బ్రతాపసింగునకుఁ బట్టంబుఁ గట్ట నాలస్యంబేల? [భిల్లునాయకునిం జూచి] భిల్లనాయకా! ఈ వీరప్రతాపుని ఫాలతలంబున గులాగతపద్ధతి ననుసరించి రక్తతిలకోత్సవము సలుపుము.

భిల్లురాయఁడు:—[ లేచి తనవ్రేలును వాలుచేసఁజెక్కి రక్తములో నంగుళము ముంచి ]

కం. మేవార్ రాజ్యంబేలిన
మేవారికి శుభముగలిగె మిక్కుటముగనే
నీవరుఁ రక్త తిలకం
బావర రక్తంబుఁగనుము యందుము నొసటన్.

[ అనుచుఁ బ్రతాపుని నొసట రక్తతిలకంబునుంచును. ]

కుబేరసేన్:—[ లేచి కిరీటంబుఁ జేకొని ]

గీ. దీప్తిఁగనెనేడి యాదిలాదిత్యవంశి
బహుళయశమును నార్జించె గుహుఁడు నేఁడె
భూపతిత్వంబు నెవికనె బాపునంది
యుట్టిమకుటంబు నీవందుమూ నృపాలా,

[ అనుచు మకుటంబు శిరమున్నైనిడును. ]

రామభట్టు:—

ఉ. స్వస్తి, సమస్త వైరిజన సాధన యోగ్య కృపాణపాణికిన్
స్వస్తి, సమస్త దేవగణ సాధన యోగ్యసుకర్మ శాలికిన్
స్వస్తి, సమస్త భూమిజన సాధన యోగ్యమృదూరు వక్త్రికిన్
స్వస్తి, ప్రతాపభూపతికిఁ బావనమూర్తికి భవ్యకీర్తికిన్.

[ అనుచు నాశీర్వదించి యక్షతలుజల్లును. ]

ప్రతాపుఁడు:—[ లేచి ]

ఉ. సోదరులార! మీరుబలు సొంపువహింపఁగ రాజ్యసంపదన్
సాదర మొప్ప నిచ్చితిరి చాలదు నాకిసి సత్కృపామతిన్
జేవము చూపకేతజినిఁ బ్రీతిని నేనొనరించు కర్మలం
దాదర మొప్పఁ దోడ్పడుదురంచు మిముం గోమదిఁ జాలవేఁడెదన్.

సోదరులారా! క్షత్రియకులాభిమానులారా! వైరికరి పంచాస్యులారా! మీరు బ్రీతిని నొసంగిన రాజ్యమునకు యామందానందుండనైతిని. అయినను నిష్కళంకానందంబు నా మానసంబునఁ బొడమదు. ఇంతటి సంతోషసమయంబున దుఃఖవార్తలు దెలిపి మీ మానసంబులు కలంచుటనాకు ధర్మంబుగాదు. అయినను చేసెఁటి మనంబున నవిస్మనాడను. మనపెద్దలచే నార్జింపఁబడిన చిత్తూరు పట్టణంబు తురుష్కులపాలయినవార్త కనినట్టి యక్షత్రియుఁడేవఁడైనను తన్నగరంబు సాధించునంతవఱకు సుఖముగ నిద్రపోఁజాలఁడు. అయ్యో! ఎందఱుక్షత్రియులాపురికై యెన్నిమారులు తమప్రాణములు వైరులకృపాణములకు బలి యిచ్చిరి? ఎందఱుక్షత్రియ పురంధ్రీమణులాపురికై వహ్నిలోఁబడి కాలిరి? క్షత్రియదేశాభిమానంబునఁగదా మనపూర్వీకులు తమప్రాణంబులు గోల్పోయిరి? వారిదేహంబున స్రవించిన రక్తము మనయందు లేదా? వారికిఁగలిగిన యభిమానంబు మాయందు లేదా? వారికి-

గలిగిన క్షత్రియపౌరుషంబు మాయందు నశించెనా? నా కరవాలంబునకుఁ గలిగిన ధార మా కరవాలంబునకు నేఁడు లేదా? మాకనిఁగనిన తల్లులు వీరమాతలు కమ్మట్టు మాతల్లులుగారా? మా యభిమానపరంబున మాను సవమానకరంబుగఁ బారసీకులు మీఁదఁ బడి యేలుచుండ మేమిటు తలవంచికొని చచ్చినవారిం బలెఁ బడియుండఁగలమా? పూజనీయములైన మా దేవాలయములఁ జొచ్చి యా యవనులు మా విగ్రహముల నిటు మొనరించుచుండ నాయందున సుండియు మనమిటు దాఁగికొనుట భూభుజుల పౌరుషమా? మా రాజ్యధనంబు చూఱఁగొనినది యొకటియుగాక క్షత్రియకులాంగనల మానధనంబు దోఁచు నీచుల పీచమడంగఁ ద్రొక్కక కనులారఁ జూచుటకు క్షత్రియులమవుటు రాపడిపోయెఁగా? అకటకటా! ఆ నిర్భాగ్యులు జోధపురు అంబరు రాజులు పౌరుషము పారావారమునఁ ద్రోసి కులధర్మము కాల్చి రంకుల ధర్మంబుల నవలంబించి యా పారసీకుని యనుగ్రహమునకై తమ యాఁడుబిడ్డలను వాని దారలుగఁ జేసి వానిసేవ కాళ్ళొత్తిరి నిజదురికదా? క్షత్రియులకింతటి క్షీణదశ వచ్చునని కలనైన మీరు దలంచియుంటిరా? భ్రాతృవరులారా! ఈ యవమానకరంబగు వార్తవినుటకు నాకు సిగ్గయ్యెడిని. ఇట్టి యవమానంబు మా రాజ్యంబునకు ప్రాప్తిల్లకయుండవలయును మనమెల్లర మేకవాక్యతఁగలిగి యేకమతినిఁబూని సర్వప్రయత్నములు సలుపవలయును. నా తాత్పర్యంబున మీరంద ఏకీభవింతురేని నాకు మీరంత యేకమతిని మీ ధైర్యసాహసంబులచే సాహాయ్య పడితిరేని మా రాజవార్ దేశమునుండి యా పారశీకులు పారులాగొనరించెద.

(అందఱుమాకది సమ్మతి సమ్మతియని పలుకుదురు)

సోదరులారా! మీ సమ్మతివాక్యంబు నాకు సమ్మోదకరంబు. మీవార్ రాజ్యాధిపుఁడు నిర్వీర్యుఁడై నిర్ధనతశోష్టిల్లుచున్నయది కావున మన మెల్లరను రాజభోగములను త్యజించి ధనముగడింపవలెను. పెండ్లి పేరంటములు మరచి పెక్కుధనము వెచ్చింపరాదు. చిత్తూరునగరంబు సాధించునంత వఱకు మనము భోజనాదులకు కనకరజత పాత్రంబులు మాని విస్తరలలో భుజింపవలెను. మెత్తని మెత్తలపైఁ బరుండుట మానవలెను. ఆ మ్లేచ్ఛులనోడించునఱకు శిఖదీక్షఁబూనవలెను. పర్వతసంచారంబలవాటగుటకై మనము పాటుపడుచుండవలెను ఉపవాసంబుల భ్యసించి దవాశ్రమకు శరీరము శోషిల్లనట్టుల నేర్పవలెను. ఆయుధనాథకులు మా పురిఁజేరనట్టుల చిత్తూరునుండి యిచ్చటి వఱకు భూములు దున్నక పాడుగ విడచి క్రూరమృగాలయంబులుగ నొనర్పవలెను. ఆరవల్లి కొండపర్వతంబులలో సందుగొందులు సైన్యమునకు మలవాటుగఁ జేసికొనియుండవలెను. "హల్దిగాట్" అని పిలువంబడు పర్వతమధ్యమార్గంబునెల్ల కాలంబు కాపాడవలెను. కతిదోరకితృధుడు రియసైతుకల నురుమాడవలెను. చిత్తూరు సాధింపవలెను. క్షత్రియ నామంబు సార్థకంబుఁ జేయవలెను శిష్టాచారంబు నిలుపవలెను. దుష్టాచారంబు దూరముసేయవలెను. ఇదియె నా ప్రార్థన.

(క్షత్రియులెల్లరు మాకు సమ్మతి సమ్మతి యనియందురు)

కుబేరసేనః— మహాప్రభూ! నూతన రాజ్యపట్టాభిషేకానంతరము వేటకు వెళ్లుట రాజపద్ధతి కావున మీరటు సేయవలెను.

ప్రతాపసింగు:— సచివవర్యా! రేపటిదినంబుననే, నేనచ్చటి కేతెంతును.

రామభట్టు:— మహాప్రభూ! మీవెంట వేటకు నేను రావలసినదే. కాతప్పుగపోతమ్మును సంప్రతిష్ఠాపన మొనరించుపని నాయది.

ప్రతాపసింగు.— బ్రాహ్మణోత్తమా! నీవనుకున్న (సభాసదులంజూచి) సోదరులారా! నాకునై మీరల నినాడు ప్రొద్దైనది. మీమీయిండ్లకుంబోయి యించుక విశ్రమించుకొనుడి నేనును బోయెద.

(నిష్క్రమణము.)

## షష్ఠ మరంగము.

### ఉదయపురిలో జేరినయరణ్యము

ప్రతాపసింగు - సుక్త - రామభట్టు - వేటకాండ్రు.

[సుక్త యొకదిక్కునుండియు "ప్రతాపుఁడు" నొకదిక్కునుండియు నొకమృగమున కై పడుచుగిడి వచ్చి యిరువురు దాని పై శరము వేయునది చచ్చిపడును. వారిరువురు సమీపించి]

సుక్త:— సోదరా! ఈమృగంబు నాచే జంపబడినది కావున దీనిని నీవంటవలదు. ఇది నా సొమ్ము నీది కాదు.

ప్రతాపుఁడు:— సుక్తా! ఏమిమాటలాడెదవు? దూరమునుండి నేనీమృగమును గని దాని వెంబడించి యీ నాశరమునఁ జంపిన దానిని నీవు గోరుట తగదు. ఇది న్యాయము కాదు.

సుక్త:— ప్రతాపా! నీవేమిమాటలాడెదవు? పొదలలో నొదిగియున్న మృగపోతమును నేఁగని దానికై కొల్చి లేపి వెంబడించుచుగడి యీనాశరమునఁ జంపిన దానిని నీవు కోరుట ధర్మము గాదు. రాజధర్మములు జక్కఁగ నడిపెదనని నీవాడినమాటి యీరీతిగా నా నీవు నడుపుదువు?

ప్రతాపసింగు:— సుక్తా! నీవు మితిమీరి మాటలాడకు. అధికప్రసంగివి గాకు. రాజును నేన ధర్మంబు నలుపుదునని యెన్నితెలిసియా? అశికంబులాడెదనని తలంచితివయా?

సుక్త:— ప్రతాపా! ఎన్న నేల! తలఁప నేల? రాజయినమాత్రాన సహజగుణంబులు పోవునా?

ప్రతాప:— జీరీ! సాగరపోతా! హెచ్చరిక. తరతమంబులు దెలిసి పలుకుము. మీఱితివేని నీశిర ముండదిక.

సుక్త:— ప్రతాపా! ఎంతటి పోటుమానిసివైతివి? నీశరమునకుఁగల వాడి నాశరమునకు లేదా? నీశరము నా శరధారలకు మీఱినదయా?

ప్రతాప:— అటులయిన నిలుచుము. నీక్రొవ్వడంచెద.

(అనుచు నిరువురు కత్తి చేఁబూని నిలుతురు)

రామభట్టు:— (సరభసముగ వచ్చి నడుమ నిలిచి) హా హా. వలదు వలదు.

చ. ఎలదిరఁ జోరుచాలు బలవంతులు చేకుఱు సోదరుల్ వృథా
కలహముఁ జెంప రాజ్యమునఁ గల్గు నుపద్రవకోటి వెల్లుగా
ఛలము బలమ్ముఁ జూపఁగను శత్రువులెక్కగ నవ్వరే? మీకుసీ
కలఁతలు చెల్లునే? యొకమృగంబునకై హితమాలకింపుడీ.

ప్రతాపా! సోదరునితో యుద్ధంబు సమ్మతము గాదు (సుక్తునిఁజూచి) సుక్తా! నీకిది సమ్మతమా? హితమా? రాజునధిక్కరించి పలుకుట ధర్మమా? ఇది ద్రోహకార్యము గాదా?

సుక్త:— ఓరీ! పిచ్చిబ్రాహ్మణుఁడా! సోదరులన్యాయంబున నీవు ప్రవేశింపకుము. అడ్డము నిలువకు వదలుము. వాని పొగరడఁచ పటుకసేఁ దలఁచు.

ప్రతాపు:— బ్రాహ్మణోత్తమా! ప్రాణసీమంఁటకై యీపొంగుఁరుఁబోతు జోలికేల పోయెదవు? వదలి నీ దారి నీవు బొమ్ము.

(అనుచు కరవాలెత్తుదురు.)

కామభట్టు:— రాజోత్తమా! రాజకుమారా! ఈ చండ్రయుద్ధంబు నేఁగనులఁ జూడఁజాలను. నను ధిక్కరించి మీరు యుద్ధమాడఁ దలంచితిరేని యీనాశవము పైనిలిచి సంగర మొనర్పుఁడి

(అనుచుఁ బిడివాలు పీకి రొమ్ముపైఁ బొడచుకొనును.)

ప్రతాప:— హా హా. బ్రాహ్మణోత్తమా! వలదు. ఇంతటి హత్య వలదు (అనుచుండ బ్రాహ్మణుఁడు మరలఁ బొడిచికొని క్రిందఁబడును.)

హా హా. పాపము పాపము. బ్రాహ్మణహంతకుండనైతిని.

(ప్రతాపుని బలము వచ్చి చేరును.)

(సుక్తుఁ జూచి) ఓరీ పాపాత్మా! ఎంతటి పాతకంబునకు నన్నుఁ గురిఁజేసితివి.

ఉ. భూపతినైన నన్నుఁ బరిపూజితుఁ డంచుఁ దలంపకీవు నా
నాపరిభాషణంబు లనుసన్పఁగ నాడుచు నివ్వఁజేసి, యీ
తాపసవర్యు చావునకు దారిసిఁ జూపితివక్కటా! మహా
పాపము నీకతంబునను బ్రాప్తిలెఁ బ్రోల్విడ వెళ్లుమాయిఁకన్.

ఓరీ! సుక్తా! నీవిందుండఁ జనదు. నా ప్రోల్విడలి పొమ్ము. నా పురమునందుండినచో ననేక కలహంములకుఁ గారణంబగును. దానినుండి రాజ్యమునకు బాధఁ గలుగును. నీకతంబున నైననా పుణ్యంబుఁ బోరదు. హెచ్చరిక.

సుక్త:— ప్రతాపా! భూమిపాలుఁడనే ననుచు గర్వించి పలుకకుము.

ఉ. మాటలు మార్గణంబులయి మానససీమను గ్రుచ్చుఁగావునన్
మాటికిమాటికిన్ బురను మానుచుఁ బొమ్మని పల్కఁబోలునే?
నేటికినీకు నాకుఁగల నెయ్యము తీరెను వైరులైతి మీ
నాటికి మాటలేలయిఁక నామనుపేరును నేఁడు పిల్చెదన్.

ప్రతాపా! మంచిది. నేఁ బురము వెడలి వెళ్లెద. ఈ పురమున నీవెటులుండెదవో చూచెద. కాలము వచ్చినపుడీ మాటఁ దలంచికొని యేడ్చెదవు.

( అనుచు నిష్క్రమించును. )

ప్రతాప:— భటులారా! ఈ శవసంస్కారంబునకుఁ దగిన కర్మమొనరించి మీరు రండు.

( ప్రతాపుఁడు నిష్క్రమించును. )

భటులు:— ( శవమునెత్తికొనుచుండ బ్రాహ్మణుఁడు లేచి ) ఓరీ! దురాత్మకులారా! నన్నేలయుంటితిరి? సోదరుల పోరుమాన్పుటకై పిడివాలు సంబట్టపైఁ బొడిచికొని యూపిరిబిగఁబట్టికొని పడియుంటిని. అంతయు నే జచ్చితినని తెలిసికొంటిరా యేమి? బ్రాహ్మణుఁడు చచ్చునా? రండు పోదము.

[ నిష్క్రమము. ]



# ప్రతాపాగ్బరీయము

చతుర్థాంకము - ప్రథమరంగము.

అక్బరునగరు.

నౌరోజాబాజారు - నవరాత్రోత్సవము.

అక్బరుభార్యలు (జోదుబి - చిక్కతాయి) - హిందూరాజుల భార్యలు

(సుందరాంబ - సౌభాగ్యవతి - మంగళాంబ - ప్రతాపవతి.)

(బాజారువీధిలో నాడువారనేకవినోదవస్తువులమ్ము చుందురు

రాజస్త్రీలువానినిం జూచుచునాటపాటలం బ్రొద్దుపుచ్చుచుందురు)

(పిదప సుందరాంబ - ప్రతాపవతి యిరువురుదప్పులోలోగానే వెళ్లిపోదురు.)

సుందరాంబ.—[దూరమున నిలిచి] [స్వగతము] దీనిమగని యభిమానంబుం దెగటార్ప సమయమిది. నేఁదన్నినయుపాయంబు సఫలంబయ్యెను. నా చెలులు సౌభాగ్యవతి, మంగళాంబ, జో.. బీ మొదలగువారు నాకనుసన్ననెఱింగి యెవరికిం దెలుపక వెళ్లిపోయిరి. ఈ ప్రతాపవతి నాచేతఁ జిక్కెను. హా! హా! నేనక్బరుపాదుషాగారికి లోఁబడి మానము నమ్మి సొమ్ములార్జించితినని నా బావ పృథ్వీరాజు నా మగనిని హేళనముసేయుచున్నవాఁడఁట మూతిపై మీసలేమాయెనని తిరస్కరించుచున్నవాఁడఁట. ఈనాఁడీ ప్రతాపవతిని పాదుషాగారికిఁ జిక్కులాగొర్చి నా బావమర్యాదఁదీసెద. అదే కూటివారందఱు మైతిమేనిం బరస్పర పరిహాసంబులకు మార్గముండదు. అదియునుంగాక మేవాడ్ రాజసుతయను దురభిమానంబీ ప్రతాపవతికి చాలుగనున్నది. దీనిగర్వంబణంచవలెను. ప్రతాపవతి నాదిక్కువచ్చుచున్నది. ఊరకయుండెద.

ప్రతాపవతి:—ఏమివదినె. ఊరకనిలిచితివి? వినోదములు చూడదమాయెనా?

సుందరాంబ:—ఏమివినోదములుపోవే. నా కాళ్లుతీయుచున్నయవి. నీకేమివయసుదానవు. నూతనవిషయంబనినఁ దనువుమఱతువు.

ప్రతాపవతి:—నీ పరిహాసంబునకుఁ గొదవలేదు. మనమంగళాంబ మొదలగువారు కానరారు. ఎచ్చట పోయిరి?

సుందరాంబ:—ఏమి. అచట లేరా? [అని చూచి] అయ్యో! ఎంతటి దొంగలు వారు? మనకు చెప్పినట్లు చేయక వెళ్లిపోయినారు. మోసగత్తెలు.

ప్రతాపవతి:—వదినే! ప్రొద్దైనది. మనము పోవుదము రమ్మా.

సుందరాంబ:—మంచిదమ్మా. పోవుదము రమ్మా. ఈ నగరు చక్రబింబము వలె తిరుగుచున్నది. ఏదిక్కునుండి వెలి వెడలవలెనో తెలియదు. ఇదియు దారి కాబోలు. పోయినపుడు నే నిటులనే పోయినది.

[అనుచుం నడ్డదారిని బిలిచికొనిపోవుచు.]

(అంగళ్లవారు తమ దుంగళ్లమూయుదురు.)

[నిష్క్రమణము.]

ద్వితీయ రంగము.

అక్బరు గృహము.

అక్బరు - ప్రతాపవతి - సుందరాంబ.

సుందరాంబ:—ప్రతాపవతీ! మేము దారితప్పితిమి కాబోలు. పాదుషాగారి గృహమిది. ఇటునుండెటు వెడలవలెనో తెలియదు.

ప్రతాపవతి:—(భీతినభినయించుచు) వదినే! మనగతి యేమి? ఎవరైన నను దారియడిగి తెలిసికొనుము.

సుందరాంబ:—ఇచట నెవరును లేరే! ఆదిక్కు బోయి చూచెద.

(అనుచు నిష్క్రమించును)

(అక్బరు ప్రవేశము)

(అక్బరునుజూచి) వదినే వదినే [అనియఱచును]

అక్బరు:—సుందరీ!

గీ. వదినె వదినె యనుచు వాచఱచెదవేల?
వదినె యెవరు నీకు? వాడ యెద్ది?
పురుషుడెవండు నీకు? బువ్వబోణి! నీవేల
కలత్రం జెంది యిచట నిలిచినావు?

భామా! భీతిపడకు. నేను పాదుషాను. రాజ్యమేలువాడను. నిర్భీతిగా మాటలను బలుకుము.

ప్రతాపవతి:—[భీతినభినయించు]

చ. ధరణిప! పృథ్విరాజునకు దారను సేనవరాత్ర సంభ్రమం
బరయగ వచ్చి వేడుకల నచ్చెరువందగ జూచుచుండ, నో

అట్టిమూని చరిత్రవ్రాయువారీవార్తవ్రాయకమానినను, పరమసచ్చరిత్రకారులేల మానుదురు ఇది నీకుఁగళంకము గాదా? ఏలదు ఏలదీ దుర్నడత.

అక్బరు:— నీరజానానా! నీవచనంబులన్నియును నిజములేను. అయినను యీ యుపన్యాసార్థంబులగునుగాని యౌవనులాచరింపనలవి కానివి.

చం. సుదతుల నేకతంబునను జూచిన యౌవనుఁ డెన్ని ధర్మముల్
బదిలముగాను నేర్చినను బాయఁగఁ జాలఁడు మారునాజ్ఞలన్
బదులిడనేరఁ డీధరను పగ్గెలుబల్కెడు ప్రాజ్ఞులెందరో,
యదనుగనంగలేక యధికార్తినిఁ గుందుచు నుందురెత్తఱిన్.

మానినీ! మారమార్గములతిసూక్ష్మములు. ఎన్ని దినంబులనుండియో నినుఁ గన్నులారఁగని రతిసుఖమందవలెనని, వెలిపేచికొనఁజాలక, మనమున నిలుపఁజాలక సమయము దొరకక తహతహపడుచుంటిని. మందయానా! చూచితివియౌవ్వనపుహిమ: ఈమహినిఁగల మహారాజులను మహావీరశూరులను నా హస్తము జయించిన నేనే మారునకు నోడితినన్న నితరులకది సాధ్యమా? విషయములను జయించినవాఁడు మహిలో లేడు. ఈవిషయమున మాటలికేఁ జాలు. రమ్మురతిసుఖాంబుధిని మునిఁగి తేలుదము. వృథాకాలముగడప నేల?

(అనుచు సమీపించును.)

ప్రతాపవతి:— ధరణీపాలా! నాసరసమురాకు నే బత్తిత్తను. మానమే నాకుధనము

ఉ. మానవనాథులన్ గెలిచి మాన్యుఁడనైతినటంచు గర్వమున్
బూనితివేమొ నీవు? పువ్వుఁబోణుల శూరత యెన్నఁ డెనీయన్
గానవుగా? సతీమణులు గౌతవవృత్తిని మాన సంపదన్
మానస మందిరంబునను మానుగ నుంతుర గోచరంబుగన్.

మానవనాథా! మానినులబలాత్కరించుట మర్యాదగాదు. అట్టుండి నీవందుఫలమేమియు లేదు. శారీరబలము పురుషులకు హెచ్చుగనున్నను వారికిఁ బ్రాణభయమంతకంటె హెచ్చుగనుండును. స్త్రీలకు దేహబలము లేకయున్నను మానసబలంబత్యధికంబుగనుండును. మానహీనతఁగనిన ప్రాణమొక ప్రాణముగ వారు దలంపరు. సకలరాజాధిరాజువు నీ వనిమన్ననలంద మానహీనలుగొందఱు నీయనుగ్రహము దొరకినఁ జాలునని తమమానప్రాణాధనంబులు నీకప్పగింతురు. అక్కతంబున నతివలందఱట్టివారేయని నీవు తలంచితివి కాఁబోలు. నేనట్టిదానను గాను. నన్ను చెనకకుము.

అక్బరు:— ఛీ! నేను చెనకవలెనా?

చం. చెనకఁగనేల నేను నిను? చేడియ! నన్నును నిన్ను నెక్కుడై
చెనకెడు వాఁడొకండు మనచిత్తమునందు వసించు నెత్తఱిన్
మనమున బాధలన్ దెలుపుమగ్గుచునైన సహించియుందురా
వనటలు సైపలేక మగవాండ్రు నమోయను వారుస్త్రీలకున్.

మానినీ! పురుషులు విషయాధీనులు స్త్రీలు విషయాతీతలనితలంపకు. ఈభయులమానసమున మనసిజుఁడు వసించి బాధించుచుండును. స్త్రీలమానసము కుసుమసమానముకావున మనసిజు శరములకు గ్రుగ్గియైనను వెలిపడక సహించియుందురు. పురుషులమానసములి కోమలము గావునఁ దత్సరములకుఁ దాళఁజాలక తరుణుల పాదసేవనమైనఁ జేయు నమకట్టి వారియను గ్రహపాత్రులగుదురు. వారిజాక్షీ! ఈ మాటలచేఁ బ్రొద్దుఁబుచ్చనేల? రమ్ము. శయ్యా గృహంబుఁ జేరుదుము. నీ వేమనినను నిన్ను నేఁ విడల? [ అనుచు కుసలసమీపించును. ]

ప్రతాపవతి:—ఛీ. పురుషాధమా! నన్నంటరాకు. దూరమున నుండుము. రాజువని నే మెత్తఁగమాట లాడిన నవినీతుఁ సిద్ధింపవు.

చం. అతిబలసంగతిన్ క్షితిని నాజినిఁ గెల్చిన రీతిఁ జూచితే
యతివలఁ గెల్వఁ? జాలుదు కృతఘ్నాకృతి యో పురుషాధమా! యింకన్
మతిఁగనిమాన్యతన్ మనుమ! మానినులన్ మరియాదఁ జూడుమా!
సతులిల మానభంగమును చావని యెన్ను దురంతు నెన్నుమా!

ఓరీ! మతిహీనా! వలదు. నా సరసకురాకు నన్నంటకు. కారాని సాహసమునకు ననుదింపకు. నీదారిని నీవు బుద్ధిఁ దెచ్చుకొనిపొమ్ము. నా హితమ్ము వినుము.

అక్రూరు:—మహిళాలలామా! నీ హితము నాకు వలదు.

చం. మహిని జయించు నక్రూరకమానిని కోడెననంగ నవ్వరే!
సహజము చేతఁ జిక్కు రుచి సానపదార్థము నుజ్జగింపఁగా!
అహిసమవేణి! చాలునిఁక నంగజకేళికి రమ్ము వైళమే
మహితసుఖమ్ము లందిమనుమా! మహిపాలుదయాభిపాత్రవై.

అలసగమనా? అలస్యంబుఁ దాళఁజాల. నిన్ను వదల.

( అనుచుఁ జెయిఁగుబట్టును. )

ప్రతాపవతి:—( కోసరి కైచీ పిడివాలెత్తిఁ జూచి యక్రూరు వెనుకకు జరుగును. ) .

శా. రారమ్మా! యిటురమ్మ ముందటికి నీరాజాధిరాజత్వముల్
రారమ్మా! కనిపించి కీర్తిఁగనుమా! రమ్మా! ఘనుల్ జంపుటల్
నేరమ్మా! యటులేల పోయెదవు! కానీ వచ్చెదన్ నే నీ
బీరమ్మున్ వెలిపుచ్చుమా! కలననిర్భీతిన్ ననుల్ గెల్వుమా!

ధరణీపాలా! దూరముపోయెదవేల? సమీపమునకు రమ్ము. నీ కృపాణంబెత్తుము? సంగర మొనర్పుము? నను నీవు జంపిన నా మానముఁ గాపాడినవాఁడవు నీ వగుదువు. నిన్ను నేఁ జంపినచో నీయట్టి దురాత్ముని పాపి యీ ధారణిఁ గాపాడినదాన నే నగుదును. రెంటను క్షేమముగలదు. అలస్యమేల? రమ్ము. ఆలోచనాపరుఁడవై తివేల? ఊచ్చపడి నిలిచితివేల?

అక్రూరు:—నతిమణీ! నీకు నోడితి. [ చేతులుజోడించి ]

చం. సుదతిరో! దోర్బలంబున వసుంధర నెల్ల జయించి పాదుపా
పదవిని హెచ్చి సర్వభువిపాలుర నాపదసేవ నుంచితిన్

మానవతి నీ యపూర్వ మహిమంబునఁ గెల్చితి విపుడున్న నే
మ్మతి నింక సుగుణమా! సతిసమాజ శిరోమణివై సుఖోన్నతిన్.

భామా! ఇఁక నేఁ బరస్త్రీముఖంబుఁ జూడను. అయ్యో! నాచరిత్ర మెంతటి కళంకంబుగలిగెను? నీ చరిత్ర మెంతటి ప్రాశస్త్యంబుగలిగెను. సతీమణీ! నీవు సహజపతివ్రతవు. నిన్నుఁ జెనకి నేఁ బాతకినైతిని.

ప్రతాపవతి:—స్వామి పాలా! పశ్చాత్తాపంబు మానస పారిశుద్ధ్యమునకుఁ గారణము. గావున నీకింక పాతకంబంటదు. ధరణీపాలా! నేఁ బోయెదను. నాకు దారిఁ జూపి నావెంట నైనఁ బంపుము.

అక్బరు:—ఏల వెలఁది? నీపాతివ్రత్యమునకు బంటునై నే నేవచ్చెద.

[ అనుచు దారిఁ జూపి నిష్క్రమించును. ]

[ సుందరాంబ ప్రవేశము. ]

సుందరాంబ:—[ ప్రతాపవతిఁ జూచి ] అమ్మా! ఏమినగ లేయిది? వచ్చినదారి మరలఁగనుట కష్టమైనది. నిన్ను వదలివచ్చి మరల నిన్ను వదలినచోటుఁ గనలేనైతిని.

ప్రతాపవతి:—అవునమ్మా! సందులు గొందులు గనుట కష్టము. పాపము నాకొఱకుగాను చాలకష్టపడితివి. వదినే! నీవు మరల నడవఁజాలవు. రాజుగారి గృహంబున రాత్రియుండి ప్రాతఃకాలంబు వచ్చెదనమ్మా. నాకేమి భయము లేదు. నేనొంటరిగఁ బోయెద.

సుందరాంబ:—రాజు గారింటిలో నాకేమిపని? నేనుని వెంటవచ్చెద.

[ నిష్క్రమణము. ]

## తృతీయ రంగము.

### పాదుషాగారి యాస్థానము.

అక్బరు - రాజామాన్ - శైమల్లు - పృథ్విరాజు - బైరాం - బీరుబల్లు.

అక్బరు:—బైరాంగారూ! ఈ భరతఖండంబునందలి యార్యుల నావ్యకృత్యంబు లనేకంబులొనరించుచున్నవారు అందున ముఖ్యమైనది సజీవ స్త్రీ మృతి. దానిని నిలుపుదలచేయింప నాజ్ఞ యొసంగినారా?

బైరాం:—మహాప్రభూ! అట్టి క్రూరకృత్యంబునకు సాహాయ్యపడినవారికి మరణదండనయని యాజ్ఞ యిచ్చినాను?

బీరుబల్లు:— ఓహో! అటులనా? భర్తవెంట భార్య యొకతే చచ్చుచుండెను. ఇపుడు తమయాజ్ఞ చొప్పున భర్తవెంట నతని బంధువర్గము పురోహితులు చావవలసివచ్చెను. బాగుగనున్నది.

అక్బరు:—ఏమి బీరుబల్! అటులమాటలాడెదవు?

బీరుబల్లు:—మహాప్రభూ! మీయాజ్ఞరీతి "సతి" యనునది నిలువదుగాని మిగతవారి భీతినిజమగును.

అక్బరు:—బీరుబల్! సతినిలువదా? నిలుచునా? చూచెద. ఏటునిలువదో?

బీరుబల్లు:—మహాప్రభూ! కన్నులుండినవారంతయుఁ జూడవచ్చును. ఇంతకంటెను దాము ఘట్టిగయొక యాజ్ఞ యొసంగియుండిన బాగుగనుండెను.

మనరాజ్యాభివృద్ధికిఁ దగినచేష్టల్బాటులఁ జలిపి మరల పచ్చుమార్గంబున నాయాబాల్య మిత్రుని ప్రతాపునిఁ జూడవలెనని యపేక్ష కలిగెను. దానికై నేవానికి వ్రాసితిని. ఉద యపురపక్షున మేమిరువురము గూడి ముచ్చటించితిమి. ఆ హా! పిదప జరిగినవంతా ంతగా బవమానకరంబు గావున నే నీసభలో నుడువఁజాలను.

అక్బరు:—బావా! నీకయిన యవమానంబు నాకు గాదా? అదియేమి? తెలుపుము?

రాజామాన్.— మహాప్రభూ!

మ. భరమే తెల్పఁగ వానిగర్వము! కులభ్రష్టుండ నేనన్చు హా!
విరసాలాపములాడి పఙ్క్తికినిఁ దావిందందఁగా రాడయో
బరిహార్యం బవిత్రభక్షణకుఁ దానంబైన చోటంచు నా
ధరఁద్రొవ్వించును మంత్రపూత జలముల్ దాఁజల్లె సంశుద్ధికిన్.

మహాప్రభూ! ఇట్టిపరిభవ సమాచారంబేమని తెలుపఁగలను.

అక్బరు:—హా. హా. ఇంతటియవమానంబు వాఁడొనర్చెనా?

మ. అదిరా! యెంతటిదౌష్ట్య మూఢులుఁడు నిన్నారీతిభంగించి దు
ర్మదదుర్గర్వ పరీతవృత్తినినినుఁ మాటాడెఁగా! బాపురే!
కుదురైవాని శిరంబు పైనిలిచెఁగా కొండాడు ధర్మంబు? నీ
వదరన్ దోలక యట్టిఁ ల్పితివిగా యామాటలాలించియున్.

(ఆదురాత్మకునిఁ బట్టికట్టి తేకయూరక వచ్చుటనీయోపిక హెచ్చు,)

పృథ్వీరాజు:—[లేచి] మహాప్రభూ! తామింతటి కినుకవహింపఁ దగినవిషయంబిదికాదు. ఆ ప్రతా పుఁడార్యుల శుద్ధధర్మంబనుసరించినవాఁడు.

మ. వలదాయార్యుల కార్యధర్మమవ నీపాలా? యకర్తవ్యమున్
గలదాయిందొక టేసి? వేఱువలఁపఁ గా నేల? నీబావయై
చెలిమైనీవిడు నన్న మీనృపతి భక్షింపక మతిన్ బూనునే?
కులమర్యాదలు బాయఁగానగునె? నీకోపంబు చాలింపుమా.

మహాప్రభూ! ఎదిరించిమాటలాడితినని నాపైఁ గోపంబువలదు. యథార్థస్థితి వలికితిని.

అక్బరు:—పృథ్వీరాజా! బాంధవ్యబలంబున నీవెప్పుడుఁ బ్రతాపుని పక్షమవలంబించి మాటలాడు చుదువు ఇన్ని దినంబులవఱకు వానివిషయము నేను ఉపేక్షచేసిన ఫలమిప్పుడనుభవించితిని. ఇది బదులిదను. [రాజామానుసింహునుజూచి] బావా!

చ. విమలచరిత్రుఁడీవు పటువిక్రమ శాలివిగాన వానితోఁ
దుములమొనర్చి నేర్పునను దుండిగు గెల్చి మదీయసన్నిధా
నమునకు వానిఁ దెత్తువని నమ్మినవాఁడను మాసలీముతో
నమితబలంబు తోఁ జనుము! యాహవకేళి యొనర్పుమావడిన్.

బావా! నీవా గర్వాగ్రేసరునిఁబట్టితెచ్చి నాసన్నిధానమునఁ నిలుపువఱకు నాకుసుఖముగ నిద్ర పట్టదు. మఱియొకటిమఱచితి. ఇంటిదొంగను బట్ట నింటివాఁడే కావలయునుగాన, మా సుతునకు సేనాధిపత్యంబిచ్చి వానిని నీ వెంటఁ గొనిపొమ్ము. పాముఁజంపుటకు మిగతయుండ యారంబులన్నియు నీ యిష్టానుసారంబు ప్రయోగింపుము. పొమ్ము. నేనునుబోయెద.

[నిష్క్రమించుదురు.]



# ప్రతాపాగ్బరీయము.

పంచమాంకము - ప్రథమరంగము.

"హల్దిఘాటు" యుద్ధము.

ప్రతాపుని సేన - అక్బరు సేన.

(ప్రతాపుని సేన కొండలపైనుండి అక్బరుసేనను బాధించుచుండును. అక్బరుసేన దిక్కుకొకరు పరుగిడుదురు. ప్రతాపుని సలీమునుంబట్టి చంపుచుండ వాని సేన మరల గుంపుగూడి ప్రతాపుని బాధింతురు. ప్రతాపుఁడు చుట్టికొనిన వారినెల్లరిని నోడించి మరల రాజామాన్ మొదలగువారు పైఁబడి రా నిలువలేక పఱుగిడును. ప్రతాపుని సేన దిక్కుకొకరు చెదరుదురు.)

సలీము:—(పడినవాఁడు లేచి) భటులారా! ఆ దురాత్మకుఁడు పఱుగిడెను. వాని ప్రాణంబున వదలుట మనకు క్షేమము గాదు. మీరిపుడే వాని వెన్నంటి సజీవునిగఁబట్టి తెచ్చిన ముదమందెదను. అటు సాధ్యము కాదేని వాని నిర్జీవ కళేబరమునైనఁ గొనిరండు. నేఁ గనులారఁ జూచి సంతసించెద. వెళ్లుఁడు. వాఁడొంటరిగఁ బఱుగిడుచున్నవాఁడు. వాని గుఱ్ఱము అలసినది. మధ్య మార్గమున ఘోరప్రవాహంబున్నది కావున వాఁడు మీకు దొరకును. వెళ్లుఁడు.

(భటులైదుగురు చిత్తమనుచుఁ బ్రతాపుని వెన్నంటుదురు. అందఱు వెళ్లిపోదురు.)

సుక్తు:—(స్వగతము) అయ్యో! నా యన్న ప్రతాపుఁడు నాకెంతటి విరోధియైనను మా క్షత్రియాభిమానంబును బట్టి మీవారు రాజ్యంబును క్షేమంబుగ నేలుచున్నవాఁడు. వాని నాశనము క్షత్రియ నామ నాశనము. ఆర్యులమత నాశనము. అకటా! ముందువచ్చు తురుష్కప్రభువులందఱు అగ్బరంతటి మంచివారటందురా? నిరంకుశాధికారంబీ తురకలకు సమకూరెనేని వీరన్యమతము వారికి నిడు సంకటంబులు వచింపనగునా? అయ్యో! దేశక్షేమంబు నే నాలోచింపవలదా? అకటా! వాఁడు నా సోదరుఁడే! మేమిరువురొక తల్లిగర్భంబునఁ బుట్టితిమే? చతుష్పాదజంతువులకునైత మంతఃకరణంబుండుగనుండ మనిషినైన నాకునుండదా? ఆలస్యము చేయు సమయము కాదు. ఇపుడే వాయువేగమునఁ బోయి వెన్నంటిన భటులను జంపి నా యన్నను రక్షించెద. అటు చేయనేని నా బ్రతుకు వ్యర్థమగును.

(అనుచుఁ బ్రతాపుని వెన్నంటిన భటులను జిక్కినవారినిఁ జిక్కినట్లుఁ జంపి ప్రతాపుని వెన్నంటి పాఁబోవును.)

(నిష్క్రమణము.)

## ద్వితీయ రంగము.

### అరణ్యము.

### ప్రతాప - సుక్త.

ప్రతాప:—ముందొక యడుగైననిడఁజాలఁ.

ఉ. కాయముకందె గాయములఁ; గాలువలైరుధిరంబుపాఱె; నన్
బాయకవెంబడించె రిపుపాళి; శరీరశ్రము తాఱె; నక్కటా!
ఘాయవనాధముల్ ప్రబలిరాజిని; యేమనసేస్తు? దైవమా!
హేయముగాదె నాబ్రతుకు? నింతకునోర్తునె మేనసుండియుఙ్?

హా. హా. క్షత్రియకులాభిమానంబుగాని, యార్యధర్మాభిరక్షణంబునకై యనేకయుద్ధంబు లొనర్చి పారశీకులఁబాఱఁదోలిన ప్రతాపుఁడీనాఁడీవిధంబున వైరులకు వెన్నుఁజూపవలసి వచ్చెనుగదా? ఏమిసేయుదు? పుట్టలనుండి చీమలువెడలినట్టుల్ల లక్షలకొలఁదిసేనను పాదుషా పంపుచున్నవాఁడు. నాసేన యత్యల్పమయ్యెను. హీనులునాజాతిక్షాత్రవమర్యాదలకైనవోర్చి తురకలసేవకు దిగిరి. జాత్యభిమానంబు మానిరి. కులముజెడిరి. ఇంతియేగాక నేకాంగిగఁ బోరుచున్ననా పైఁగరుణింపక కలహంబునకు దిగిరి

మ. కులమర్యాదల గౌరవంబ్బునకటా! కోల్పోయి భూభృద్వరుల్
చెలిమిఙ్ జేసిరి పాదుషావిభునితో సేమంబటంచెన్ని నీ
చులమాడ్కిఙ్ దమయాఁడుబిడ్డలనయో సొంపేదఁగానిచ్చి రా
కులహీనుఙ్ గలయఙ్ సనాతనవిధుల్ గూలఙ్ యశం బాఱఁగఙ్.

ఇపుడేమనికొని యేమిప్రయోజనము? ఏమిసేయఁగలను? ( దూరముఁజూచి ) ఏదీ నన్నుఁ బెంబడించువారు? వెనుకనిలిచిరేల? ( మరలఁజూచి ) ఎవఁడొ తురుకఁడు వఱిగిడివచ్చుచున్న వాఁడు. నేనెందుడాఁగుదును? ఒకనితోనైన యుద్ధమొనర్చుటకు నాకుఁబ్రాణలేదాయెనే? వాఁడునన్నుఁ బట్టుటకు వచ్చినవాఁడని తోఁచెడు. నాకుసహాయముగ నొకఁడైననిందు లేఁడాయెఁగా? హా, హా, వాఁడుసమీపించుచున్నవాఁడే? ఏమిసేయుదు. ఎందుడాఁగుదు. అయ్యో! సమీపించెనే? హా! చేతవాలున్న క్షత్రియుఁడు తనప్రాణంబూరక వైరిచేతులో నిడునా? కానిమ్ము రానిమ్ము చూచెద. ( అనుచుఁగత్తినికేలఁ బూనును. )

సుక్త:—[వచ్చి] అన్నా! ప్రతాపా! నేనీసోదరుఁడను. సుక్తను.

[ ప్రతాపుఁడు కౌఁగలించుకొని కొంతకాల మూరకయుండి ]

ప్రతాపుఁడు:—తమ్ముఁడా! ఎన్నిదినంబులకు నిన్నుఁజూచితిని? సుక్తా! ఎంతటికష్టకాలంబునా కొదవెను? సోదరా! నీవచటికి నేలవచ్చితివి? నన్ను వెంబడించినవారిలో నీవొకఁడవా? నన్నుఁబట్టుటకు వచ్చితివియా? ఆతురకమొరకులఁజిక్కుటకంటెను నీకు నేఁడొరకినందులకు ముదమందితి; సుక్తా; అతుచ్ఛపారసీకులకు నాప్రాణంబప్పగింపకు. నినువేఁడికొనియెద.

సుల్తా:— అన్నా! నీవిటు మన్నింపుము. నిన్ను నేఁబట్టను వచ్చినవాఁడనుగాను.

ఉ. సోదర! యాదురంబునను సోలుచు నీవిటు పాఱఁజూచి యా
పాదుష సేన వెంబడిని వట్టిని సుల్తాను నిపోవ నెన్నఁగా
ఖేదము నోర్వలేనయితిఁ గీడ్వడు నీకును దోడు నీడఁగా
సోదరత౯ వడిన్వెడలి వచ్చితినన్న! నిజమ్ము నమ్ముమా!

అన్నా! ఏకాంగిగ యుద్ధమొనరించు నిన్ను లక్షలకొలఁది పారసీకులు జుట్టుకొనిన సమయమున నిన్నువారు జంపుదురేమోయని భయపడి నీవు బయిలుగిడుటకు దారిఁజేసి యిచ్చితిని. నిన్ను వెంబడించినవారి వెంటనంటి వారినెల్లరిని మార్గమునఁజంపితిని. ఇదియ న్యావృత్తాంతము

ప్రతాపుఁడు:— (మరల సుల్తానుగౌఁగలించుకొని) తమ్ముఁడా! కష్టకాలంబునవైన నీకునాపైఁ గరుణ వచ్చెనేయని సంతసించితి. సుల్తా! నున్ను దానవయుద్ధంబున మన శ్రీరాములకు లక్ష్మణుఁడు సాహాయ్యపడినటుల నీవునాకు సాహాయ్యపడియుంటివేని పారసీకులీభరతఖండమునఁ బాదమూని నిలువనటులొనరించుచుంటినిగదా? మామతమువారందఱు న్యమతము వానినిఁ గొలుచుటయగాక నన్నెదిరింపఁ బ్రయత్నించుచున్నవారు. ఏమి సేయుదు?

ఉ. సోదర! యేమి తెల్పుదును? స్వోదర పోషణకష్టశీలురై
పాదుష పాదసేవనమె పట్టుగఁబట్టిరి మామతస్థు లిం
కేది యొదిక్కు? నేనొకఁడ నేమి యొనర్పఁగఁ జాలువాఁడ? న
న్నాదరత౯ గనుంగొనుము! యారయు మాకుల ముద్ధరింపఁగ౯.

సుల్తా:— నీవుచిన్నవాడయునను నిన్ను వేఁడికొనియెద. నీకునా రాజ్యము వదలుమనిన వదిలెద. ఎటులైనయిన మాకులంబుద్ధరింపుము. క్షత్రియధర్మంబు స్థాపింపుము. ఆర్యనీతినిలుపుము. సూర్యవంశజులైన మీవారి రాజుల శరీరరక్తంబకళంకంబను పేరునిలుపుము. సోదరా! ఆలోచింపుము. అక్బరు వీరాధివీరుఁడనునది నిజము. ఆర్యధర్మభంగంబు గలిగింపఁడనునది వాస్తవము. అన్యమతస్థులను తనమతంబులోఁ జేరుమని బలాత్కరింపఁడనునది సత్యము. ఇవియన్నియును తనరాజ్యము భద్రముగస్థాపించుటకై పూనినప్రయత్నములని తెలియుము. మనజాతివారికి నౌకరిలో నౌకరికిఁగలహములు బెట్టి రాజ్యములు సాధించుచుండు విధమునీ వెఱుఁగవా? తురకలకు హిందూమతము వారిపై నభిమానముండునా? మనరాజ్యములు సాధించి మన మతము జెఱిచి మనభూములుగుంజికొని, మనకులస్త్రీలనవమానపఱచి మన దేవాలయములను లయమొనర్చి తుదకు మనపైఁదలపన్నులు గట్టి మనయొండ్లనుండి వెడలఁగొట్టినపుడుగదా మనవారికిబుద్ధివచ్చును? అయ్యో! అంతటికాలంబు తటస్థించునేయని కలకాలంబునుండి యహోరాత్రములు చింతించుచున్నవాఁడను. కలలోనైననాకిదియ కలవరింత. నాబలంబుడిగినది. నాసేనయంతయుఁ జీకాకుపడినది. అక్బరు సేనహెచ్చుచున్నయది. సోదరా! నీవెటులయిన మనకుల ముద్ధరింపుము. తమ్ముఁడా! నినువేఁడికొనియెద.

శుక్త:— హా. క్షత్రియవంశమా! సోదర. నామనసవిచారంబంతయుంతెయు నీనుడుసరజాల.

శా. అన్నా! యేమని తెల్పు వాఁడనకటా! యానాఁడు కోపంబునన్
నన్నీ వాడిన మాటకున్నినిసి నేనిందుండి వేఁబోయి యె
న్నెన్నోపన్నము లంది వేఱుగతిలే కీడ్పొంచునిన్ గొల్చితిన్
వన్నెన్బాసియుఁబొసి యగ్రజునిపై వైరంబు సాధించితిన్.

అన్నా! ఈ నాశరీరమతిభారము. నాబ్రదుకువ్యర్థము. నేనుక్షత్రియ కులంబునఁ బుట్టిఁ దగినవాఁడనుకాను. నా ప్రాణంబు నీకృపాణమ్మునకు బలియగుఁగాక. అయ్యో చిన్నతనంబున గర్వించి నీతోవాదాడిన కోపమ్మున నిన్నెటులయినఁజంపఁ బగఁబూని యీపాదుషాను చేరితి. చేరుటయేచాలక వానికొలువుననిలిచితి. వానిపక్షమేనాఁటికిఁ బ్రాణమున వదలనని వాగ్దానమిచ్చితి. అంతటితోఁదనివినందక నీపైయుద్ధమొనర్ప వానిఁ బురిఁగొల్పితి. ఇంతచేయు వరించితినిగాని యుద్ధమున నీవు పడుబాధలనుజూచి యది యేమిపాపమో నామానసము సైఁపఁజాలనిదాయె. అపుడుమన మాతృగర్భరక్త సంబంధబలము నాస్మరణకువచ్చెను. కన్నీరుఁగార్చితి. అన్నా అగ్బరునకు వాగ్దానమిచ్చి యిపుడెటు దానిని మరల్పనోపుదు?

ప్రతాపుఁడు:— (ఆలోచించి) సోదరా! హరిశ్చంద్రవంశసంభవులైన మనమన్నృతమాడనగునా? అన్నృత మిహమున దుఃఖంబు దెచ్చు. పరసుఖముదక్కించు. అధమాధముఁడైన నన్నృతంబునాడ నగునా? వలదు. నీవాపాదుషావద్దం జేరి సుఖముననుండుము.

సుక్త:— అన్నా! నీహీనస్థితిని జూచిననాకిఁక సుఖమెచ్చటినుండి వచ్చును? అయ్యో! ఏమియుఁబోఁ పదే? అన్నా! నావదినెయెచ్చటయున్నది? పిల్లవాండ్రెచటయున్నవారు?

ప్రతాప:— తమ్ముఁడా! వారందఱుఁ గోమల్ మియరులోనున్నవారు?

సుక్త:— అన్నా! చెడితిమి. పాదుషాబలంబులోఁ జాతుర్భాగంబుఁగొని రాజామాన్ కోమల్ మియ రును వశపఱచుకొనుటకై పోయినవాడు. చాతుర్భాగబలంబుఁగొని మహబల్ఖాను "ఉదయ పురి" పట్టనుపోయినాఁడు. కావున అన్నా! నీకిపుడెందును క్షేమములేదు. నీవు నాగుఱ్ఱమును బుచ్చుకొని వాయువేగమనోవేగమునఁబోయి మనవారినందఱిని నచటినుండి పిలిచికొని "ఆరవల్లి" కొండలలోనుండు భిల్లునాయకుల పల్లెలు జేర్పుము. కాదేని యన్నిటఁ జెడు దువు. రాజామాన్ నీపైనగ్రిగ్రక్కుచున్నవాఁడు.

ప్రతాప:— సుక్తా! ఇట్టిదురవస్థలోనాపాలిదైవమీవని నేఁదలఁచెద. తమ్ముఁడా! నీయట్టియాపద్బాంధ వుని తమ్ముని నేనెటుమరవఁగలను. అయ్యో! సుక్తా? నిన్నువదలి నేనెటుపోఁగలను?

(ఒకరొకరుకౌఁగలించుకొందురు).

సుక్త:— అన్నా? ఆలస్యంబునకుఁగాలంబు లేదు. నీవు వెళ్లుము.

ప్రతాప:— తమ్ముఁడా? మఱియొకటినిను వేఁడెద.

సుక్త:— అన్నా? అదియేమి?

ప్రతాప:— తమ్ముఁడా?

కం. మాఁవారిపైన నెన్నఁడు
నీవాలునుఁ బట్టి నను బట్టనిక్కం బనుచున్
నీవిప్పుడు మాటయిచ్చిన
దైవముపై భారమిడుచుఁ దీరవెడలుదునికిన్.

సుక్తా! మాటయిచ్చెదవుగదా?

సుక్తా:— అన్నా! మాటయిచ్చితి. వెడలవలె. దైవవశమున మరలనీకుబలంబుఁగూడునంతవఱకుఁ గొండ సీమలుదప్ప మఱిరొకచటను నీవుయుద్ధప్రయత్నంబుసేయకుము. దైవమునీకునేమమొసంగుఁగాత.

ప్రతాప:— తమ్ముఁడా! పోయివచ్చెద. ప్రాణంబుననున్న మరల నీముఖంబుఁజూచెద. (అనుచుఁగన్నీరుఁగార్చును.) సుక్త పోయివచ్చెద.

(ఒకరినొకరు జూచుకొనుచు నిష్క్రమింతురు.)

## తృతీయ తరంగము.

## అరణ్యము.

ప్రతాపుఁడు - గౌరాంబ - ఉమ్రా - జగత్‌సింగు - సంగ్రామసింగు - రణసింగు
భ్రమరాంబ - ఆసాధు - ( భిల్లునాయకుఁడు. )
ప్రతాపుఁడు - పెండ్లాము - కోడలు - పిల్లలు - కొన్నిమూటలు మోసికొని
పిల్లలనెత్తుకొని శ్రమపడుచు నడుచుచుండును.

ప్రతాపుఁడు:— [ భిల్లునాయకునిఁజూచి ] భిల్లునాయకా! మనమునిలుచుటకు సమీపమందెచటను పల్లెలు లేవా?

భిల్లు:— మహాప్రభూ! ఇంకరెండు గడియలు మనమిటులనే నడిచినయెడల భిల్లులగుడిసెలు నాలుగుగల పల్లెయొకటి యున్నది.

రణసింగు:— [ ప్రతాపునిఁజూచి. ]

సీ. నాయనా! యాంధ్రోప నడువఁగఁజాల
నాయడుగుల రక్తము వేడలెఁగనుమ

సంగ్రా:— తడిలేదునోట నేఁదడయఁగఁ జాలను
దాహమయ్యెడు నీరుదారిఁగాన

జగత్:— ఊరున్నదిచట నే యూరకయుండుమా
యనినీవుబల్కిన వార్తమీతే

ఉమ్రా:— బడలికబలమాయె నడవిలోఁబడియిఁక
నోడలెటునిల్పుదుఁ బుడమిశౌంద్రా

రణసింగు:— గీ. ఆకలయ్యెనాకు నక్కటా! యన్నమును
నెవరు పెట్టఁగలరో! యింకను బాళి

సంగ్రాము:— అయ్యో! నేనుచాల నలసితిఁగొప్పన
పయనమింకనునీవు పలుకవలదు.

( అనుచుఁబిల్లలందఱు దుఃఖించుచుఁ గూర్చుందురు )

ప్రతాపుఁడు:— హా. హా. కష్టము. కష్టము. రాజాధిరాజునకు నింతటికష్టమగునే? (నిట్టూర్పు నారించుచు భార్యగౌరాంబనుజూచి) ప్రేయసీ! మనకింతటి దుర్దశసంభవిల్లెఁగదా?

చం. మలమల మాఁడసాగిరయొ మండెడు నాకలిచేత బాలురీ
యలజడిఁజెంది బిడ్డలకటా! బలుసోలిరినేల వ్రాలుచున్;
గళవళ మందితీవు కడుకాఁతియలంబడి కాననంబులోఁ
గలఁతలనంది నే నెడియుఁగానను మానిని! యేమిసెల్పుదున్.

( అనుచు మొగము వంచికొని కూర్చుండును. )

గౌరాంబ:— ప్రాణపతీ! ఏలచింతించెదవు? చింతించినచో ఫలమేమియును గలదా? వచ్చినయాపదలు వలదనినఁబోవునా? మున్ను ధరాతలంబు నేలిన నైషధేశుండు సామాన్యుఁడా? అతనికొదవిన యాపద్దశకంటె నిది హెచ్చా? దురోదరంబున నతఁడు రాజ్యము గోల్పోయెను. దురంబున నీవు గోల్పోతివి. మానవజన్మంబున సుఖదుఃఖములు సహజమేను. ప్రాణపతీ! హరిశ్చంద్రుఁడు మనవంశమూల పురుషుఁడుగాఁడా? అతఁడు సార్వభౌమపదవి ననుభవింపఁడా? అంతటివాఁడెంతటి దుఃఖంబనుభవించె. తనధర్మపత్నిని వీథినిడి విక్రయించెనుగదా! దానికంటెనిది హెచ్చా? వలదీచింత మానుము.

సీ. మానవాధిప యింకమనమున నీవంత
మానుమా యటంచుఁబూని మనుమ!
ఎంతవానికినైన వంతలుదప్పవు
సంతసంబంటుచుఁ జింతయుండు
కలిమిలేములు భువిఁగావడికుండలై
యొకటిహెచ్చిన మఱియొకటితగ్గు
శారీరయాత్రకు శకటచక్రములగు
సుఖదుఃఖములు రెండుఁ జూడవలదె?

గీ. సంతసము వంతలివిరెండు చలువవేఁడి
కళలఁబోలుచు నుండు భూకాంతవినుమ
దీనితత్వంబుఁ దెలియక మానవాళి
వదలు ధైర్యంబు దుఃఖసంప్రాప్తివేళ.

ప్రాణపతీ! నీవంటివారు వాపోయిన దుఃఖించుటతగదు.

ప్రతాపరుద్రః:—భామా! నీ సాంత్వనవచనంబులకు నేను సంతసించెదనుగాని నిజముగ మానసమందిడిన దుఃఖంబెటు లీడ్వఁగలను?

ఉ. ఓరమణీమణీ వ్యసనమోర్వఁగఁ జాలఁగలేను బాలురీ
తీరున సోలి సామ్మ సిలిదీనతఁ గుందిరి యించుకైన యా
హారము రాత్రినుండియును నారయలేదుగదా? ధరన్ నిరా
ధారులమై కృశించితిమి దైవమయో! దయచూపవిత్తఱిన్.

మానినీ! యీ వ్యసనంబుఁ జూడఁజాలను. అయ్యో! మనపిల్లలిటుచూడు. యెటువ్రాలినారో? ఈ కుసుమకోమలగాత్రి కోడలు నోరువిడువక నడచుచున్న యెన్ని సంకటములు పడుచున్నదియో దైవమెఱుంగును,

సీ. కనుఁగందులను నేను కాలుచక పుడమిఁద్రిప్పి
కనుఁగందఁ జేసితిఁ గరుణవదలి
నడయాడు దుడుకు పటుకుండు బుద్ధతప్పి
యటుపులనిడుచు మఱఁగుచుందఁగలరె!
కుసుమకోమల గాత్రి కోడలీరీతిని
గోడులు గుడుచుచుఁ గుందెనకట
పిల్లలతల్లివి ప్రేయసీ! నీవిటు
కల్లగవపలఁబడు కాలమయ్యె

గీ. అకట! భూభుజజన్మంబు వ్యర్థమవని
నందు భూపాలుఁడను పేరునందఁ జనదు
భరతఖండమునందార్య పథము నిలుప
నేనుబడినట్టి పాటెల్ల నీటఁగలిసె.

అయ్యో! దుర్భరము. దుర్భరమీశరీరము. ( అనుచుఁ జింతించును. )

గౌరాంబ:—ప్రాణనాథా! నీవిటులైన మాగతియేమి?

ఉ. మానవనాథ! వేఁడెదను మానుమనీవెసనంబు ధైర్యమున్
బూనుము గడ్డిగింజలను బూరెలుగా నొనరించి వీరికిన్
బోనమమర్తు నేనిపుడె భోజన మబ్బినఁ గష్టమేమియున్
గానక ముందుదారి వడిగన్ జనశక్తియుఁగల్గు హెచ్చుగన్.

( అనుచు గడ్డిగింజలపిండి మూటలోనుండివిప్పి భిల్లునింజూచి )

భిల్లునాయకా? కట్టెలు రెండు తెచ్చియగ్గి చేయుము.

పిల్లవా:—అమ్మా! కట్టెలకేమికోవ? ఇటటనేయున్నవి. చేతిముకిరాయితో నగ్గిచేసెద ( అనుచు వనసంచిలోనుండి రాయితీసికొట్టి యగ్గిచేసియిచ్చును. )

గౌరాంబ:—( మఱుగునఁబోయి రొట్టెలుతట్టి కోకనిసిఁజూచి ) భ్రమరాంబా! ఈ రొట్టెలతట్టు చూచుచుండుము. పిల్లవాయసని బిలిచికొనిపోయి త్రాగను నీరుదెచ్చెద.

భ్రమరాంబ:—అత్తా! అటులనేఁజేసెద.

(గౌరాంబ కడవనెత్తికొని నీటికిఁబోవును.)

( ప్రతాపుఁడు పిల్లలు నేలపైఁబండికొని నిద్రపోవుచుందురు)

(భ్రమరాంబ యలసటచేఁ గూర్చుని నిద్రపోవుచుండగ నడవి పిల్లివచ్చి రొట్టెలెత్తుకొని పోవును. దానిచప్పుడువిని భ్రమరాంబ పిల్లిరొట్టెలెత్తుకొని పోయెనే అయ్యోయని యఱచును. ప్రతాపుడు, పిల్లలు లేతురు. గౌరాంబనీరెత్తి కొనివచ్చును.)

భ్రమరాంబ:—అత్తా! పాడుపిల్లి యెచటనుండియోవచ్చి రొట్టెలెత్తుకొనిపోయెను. తునుకలుకొన్ని యచ్చటనచటఁబడినవి. ( అనుచు రొట్టెతునుకలు,తెచ్చి తనయత్తచేతికిచ్చును. )

రణసింగు:—[ పరుగిడివచ్చి ]

కం. అమ్మా! తాళఁగఁజాలను
రమ్మా నాకన్న మిడుచు రక్షింపుము వై
శమ్మున నేనిను వేఁడెద
సొమ్మసిలెదఁ జేహ మిటులఁజూపుము కనులన్.

సంగ్రామసింగు:—అమ్మా?

కం. ఈతఱిఁ దాళఁగఁజాలనె
మాతల్లి! రొట్టెతునుక యివ్వవె నాకున్

(అనుచుఁ గేలు సాచును)

జగత్ సింగు:— ప్రీతిని నాకది యివ్వవె
మాతా! నిను వేఁడువాఁడు మనుపవె నన్నున్.

( అనుచుఁదల్లిని చేయిపట్టుకొనును )

గౌరాంబ:—అయ్యో! తనయులారా? ఇంచుక యోపిక విడువకుఁడు. ఈ తునుకలు దమలినీరఁ ద్రావుడు మరలరొట్టెలు చేసియిచ్చెద.

( పిల్లవాండ్లు “నాకు మొదటయిమ్ము”, “నాకు మొదటయిమ్ము”, అనికేకలు వేయుచు బాధింతురు. దానింగని )

బునుఁజూచి యింతటినికృష్టదశ రాజాధిరాజగు నాకొదవఁజేసెనని చింతించి చాలల పురోభివృద్ధినాలోచించి యన్యమతావలంబకులైనను మీరు కరుణాశీలురనియెంచి యీయుత్తరంబు వ్రాసితిని. ఎంతటివిపదబ్ధినిమునింగి నాయంతటివాఁడే దుఃఖోదంతంబు తనవైరికివ్రాయ సమకట్టునో తానేమెయుంగఁదగినది. ఇంతగవ్రాయఁబడిన దానిముఖ్యోద్దేశమేమనిన తమరు కృపాశీలురై మీవారు రాజ్యము తమకులోఁబడిన రాజ్యమనితలఁచి యింకనన్నే విధమున బాధింపక నామానసమునకింకనెట్టి సంకటంబులు దెచ్చిపెట్టక తమ సమాగుణము లోకప్రసిద్ధి చేయుదురని కోరుమిత్రుఁడు.

ప్రతాపభూపాలుఁడు.

( కాయితమునుచదివి మడిచి భిల్లానాయకునిఁజూచి )

భిల్లానాయకా! యీ జాబుఁగొని ఢిల్లీపాదుషాగారికి నందించిరమ్ము. నేనిచటనే నీవు వచ్చునంతవఱకు నుండెద. కొన్ని దినంబులిందుండి వెడలఁజాలను.

భిల్లునాయక:—చిత్తము ( జాబుఁగొని నిష్క్రమించును. )

ప్రతాపుఁడు:—హా. ప్రతాపుని జన్మమీభువివ్యర్థము, వ్యర్థము. అయ్యో! ఈ ప్రతాపనామంబు నాకిఁక నిరర్థకము. అకటా! పిల్లలసంకటమ్ముఁజూచి భరింపఁజాలక శరణాగతుఁడనని, తనజన్మ ద్వేషికి మొఱలిడినవాఁడు భూభుజజన్మంబెత్తినవాఁడా? తనబిడ్డలఁ జక్కఁగఁ గాపాడ నేరని దుర్బలుఁడు భూపాలనామార్హుఁడా? హా. హా. పరిభవదూషితమగు నీ శరీర ముండనేమి? ఆ పాదుషాయొకవేళ ననుమన్నించి రాజ్యంబిచ్చెనుపో నేనేమని యా రాజ్యమేలుదు? పరివారిలో మఱియాఁగల మానిసినని నేనేమని ముఖమెత్తికొని బ్రదుకుదు? హా. దైవమా! నన్నింతటి దుర్దశకు గుఱిఁజేసి కన్నులారఁజూచెదవా? ఏమి నేయుదు. క్షత్రియపౌరుషంబు నా తాత సింగరాజుతో నంత్యమయ్యెను. అయ్యో! ఆ సింగరాజునకు నేఁబుట్టక దుర్బలుఁడగు నుదయసింగు గర్భమునఁ బుట్టితినిగదా? యుద్ధమున మేనుఁబాయక తీపని ప్రాణమున నిలిచితినిగదా? హా. హా.

సీ. మహనీయసత్త్వుని గుహుని నామంబును
నేఁబుట్టికూల్చితి నిక్కమకట
రణభీముఁడగు బాపురాజు యశంబును
నేఁబుట్టికూల్చితి నిక్కమకట
అమ్మహామహుఁడగు సమ్మరసికీర్తి
నేఁబుట్టికూల్చితి నిక్కమకట
సంగరభీకరు సింగరాజుని పేరు
నేఁబుట్టికూల్చితి నిక్కమకట

గీ. కులముపెంచువారు కొందఱు ధరలోన
కులముదెంచువారు కొందఱయ్యొ

పంచస్థ్పపూంక్షనుండి యొలమి నార్జించిన
కీర్తిసమయఁగొట్టి కీడు వడితి.

ఇఁక నేనేమనికొనిన నేమిప్రయోజనము? ఎంతచింతించిన నేమిప్రయోజనము? ఆయ్యో! నా కాగిదమా పాదుషాసభలోఁ జదివినపుడు నా వైరులెంత సంతసించెదరో? ఆ పాపాత్ముఁడు రాజామార్గ తాననినంతటిపని యొనరించితి నేయని యెంతగర్వించునో? ఆ ప్రతాపుని గర్వమడఁగెనని జోదుపురాధిపుఁడెంత హర్షించునో? నా కోపమునది పృథ్వీరాజు నాకుగానెంతచింతించునో? నా చెల్లెలు ప్రతాపవతి నా హీనస్థితినివిని యెంతదుఃఖించునో? ఏమిసేయుదును? యత్నమిమీ తెలను? ( గౌరాంబనుఁజూచి ) ప్రేయసీ! ఇఁకఁగొన్ని దినంబులు నేనిచట నేయుండు వేళ్లలోనివసించి ముందు ప్రాణముననుంటినేనిఁ గర్తవ్యంబు నిర్ధరించెద.

గౌరాంబ:—ప్రాణపతీ! ధైర్యమువదలకు.

గీ. బహుళదినములఁ గళలేఁడి బాధఁజెందు
కమలవైరినిఁ గానమే కాంతమనము!
మరలఁగళలన్ని సమకూరి మానితముగ
జగతి నేలఁడె యారాజుసంతే సముగ.

ప్రాణకాంతా! తగ్గుముగ్గులేరికైని సహజము. కావున చింతింపవలదు.

ప్రతాపుఁడు:—కాంతా! నీ దయయూటమాటల సంతసించితి. విధివిపర్యయమయినపుడు మనముచేయునదేమి? ఇఁకఁగాలంబుగడపనేల? సమీతమునసుండు భిల్లులపల్లె వైళమ్మెపోయెదము, శిశుజిత్తును నీ వెత్తికొమ్ము. నేనీమూటలు మోసికొనివచ్చెద.

గౌరాంబ:—అటులనే కానిమ్ము. ( అనుచుఁ బిల్లవానినెత్తికొనును )

ప్రతాపుఁడు:—( మూటలుమోసికొని )

కం. ధవళచ్ఛత్రము నీడను
నవమణి మకుటంబువలన ననుపఁబడిన భూ
ధవుశిరమున నిలిచెనె యీ
తపుదుర్గగలమూటి? యకట! దైవవిచేష్టల్.

( నిష్క్రమణము. )



# ప్రతాపాక్బరీయము.

షష్ఠమాంకము - ప్రథమరంగము.

అక్బరుపాదుషా యాస్థానము.

అక్బరు - ఖాన్‌ఖాన్ - రాజామాన్ - మల్లాందేవ - పృథ్వీరాజు - భిల్లునాయకుఁడు.

**అక్బరు:**—మిత్రులారా! సేనాధిపతులారా!

చం. పటుబలశాలురిందఱును బారెడువానిని నాప్రతాపునిన్
కుటిలునిఁబట్టి నాపురిని గూల్పఁగఁ జేయకవచ్చినారు మీ
రెట్టులు కడువిక్రమాఢ్యులని యెన్నుదు నేను మనంబునందు సం
కటమిది యొక్కరాజు ననుఁ గాదని ధిక్కృతిఁ జేసె నన్నచో.

సేనానులారా! మీరు యుద్ధమునఁ బ్రతాపునిఁ గెలిచితిమని యెన్ని పౌరుషములు పలికినను నాకవి సంతసంబులుగాక యున్నవి. మీరందిన జయము నాకపజయముగాని జయముగాదు. రాజ్యధనంబులు లేవని నేనేనాఁడుచింతింపను. మనుజులెల్లర నెల్లకాలంబు తిరస్కరించి దూషించు దుర్గర్వి నా పాదసేవకునిఁ జేయనైతినని దుఃఖించెద. కొండలక్షల సేనలోఁ బూడిపడి వేలభటులతో మీరుపోరి జయించినదొక జయమని నేఁడలంతునా? మీ బలమును ధిక్కరించి సేనలోదూఱి నాకుమారుఁడగు సలీముసరసం జేరి యేనుఁగపైనున్న వానిఁ గసరుచు నుగ్రమెగరించి వానినిఁ జంపఁజూచిన యా ప్రతాపుని పరాక్రమము మనసుసంతనుతించినను తక్కువయని నేనెంతు. హా. హా. ఆనాఁడు మన "సలీము" ఉక్కుకవచంబు దొడిగియుండఁడేని యింతవఱకుఁ బ్రాణంబుననుంట, నందియంబుగనుండినదఁట. అట్టివైరి గాయముల బాధకు తాళఁజాలక బవరంబుపడి పరుగిడినప్పుడు వెంటనంటిపట్టక వానినిఁ బ్రాణంబున వదలివచ్చిన మీ పౌరుషము నేనెంత్తనిదూషింతు. సేనానులారా! మీ రెట్టులయినను వానినిఁ బట్టిలేకున్న నా మనంబునకు సంతసంబుగలుగదు.

**పృథ్వీరాజు:**—(లేచి) భూమిపాలా!

గీ. ఆప్రభాకరుఁ బట్టఁగనగునె మీకు?
ఆప్రదీపమునంటఁగనగునె మనకు?
ఆప్రతాపునిఁ బట్టఁగనగునె? యేల
ఆప్రయత్నంబు వలదిఁక నవనిపాల.

**రాజామాన్:**—(లేచి) ఏమీ! పృథ్వీరాజా! వానినిఁబట్టుట సూర్యునిఁబట్టునంతటి కష్టతరమా? బాపు యని యభిమానమున మాటలాడెదవు కాఁబోలు? అలనాఁడు మనసుకు మనసు

రాజామాన్:—[ జాబందె ] చదువుము.

[ వెనుకటిరంగములో వ్రాయఁబడిన జాబుచదివి. ]

ఆ ప్రతాపుని పొగరిప్పుడుగదా యణఁగెను. వానిగర్వమునకుఁదగిన శాస్తియాయెను. ఇఁక వాఁడు జీవచ్ఛవుఁడై బ్రదుకును.

పృథ్వీరాజు:—[ లేచి ] ఏమీ! రాజామాన్! ఏమిమాటలాడెదవు?

కం. ఆ జగమేలఁ గఁజాలిన
రాజెటుసమ్మతిని వైరిరాజును గొలుచున్
రాజామాన్! నీవిటులన్
రోఁజుచుఁ బ్రల్లదములాడ రోఁతయుఁగాదే!

నీవిటుపలుకకు.

అక్బరు:—పృథ్వీరాజా! ఇఁక నీప్రల్లదంబులు ముగింపుము.

చం. చదువుము కాయిదంబిదిగో! చాలిఁక నే విననోపఁజాల నీదుప్ర
ల్లదములు పాదుషాబలము లక్ష్యముపెట్టక నిల్వనేర్చునే
కుదురుఁగ శాత్రవాళిధరఁ? గూటికిలేక ప్రతాపుఁడీగతిన్
బదిలమటంచు నాయకుఁగఁ బట్టఁగ వేఁడెడు దైన్యవృత్తిచే.

పృథ్వీరాజు:—మహీపాలా! భరతఖండమునందలి యితరమహీపాలురనేకులు నీ కొలువునకు లొగ్గుదురు గాని ప్రతాపుఁడు లొగ్గుననిన నెవరునమ్ముదురు? క్షత్రియకులాలవాలమైన మీవాడ్ రాజ్యమును, క్షత్రియకులాభరణుఁడగు వీరప్రతాపుఁడు ప్రతాపుఁడు నీవశపఱచి. నీకు లొగ్గియుండునా? అటులైనఁ బ్రపంచమునిలుచునా?

చం. పవనమువీచునే? కుదుటఁబర్వత పాళియునిల్వ నేర్చునే?
భువియడుగంటదే? జలధిభూతల మెల్లనుముంచి పారదే?
దివి రవికాంతి చేడ్పడదే? దీప్తియడంగదె జ్వాలమాలికిన్!
తివిరిప్రతాప భూవిభుఁడు దీనతఁగుందుచు నీకు లొగ్గినన్.

భూపాలా! ఆ కాగిదము సేనమ్మను.

అక్బరు:—ఏమీ! ఆ కాగిదము సృష్టింపఁబడినదియా?

పృథ్వీరా:—సందేహము లేదు.

అక్బరు:—ఎవరిచే సృష్టింపఁబడినది?

పృథ్వీరాజు:—మీవద్దనుండు స్తుతిపాఠకులచే

అక్బరు:—[ భిల్లునాయకునిఁజూచి ] ఓరీ! భిల్లునాయకా! ఈ జాబెవరిచే వ్రాయఁబడినది? ఎవరు నీచేతికి దానినిచ్చిరి?

భిల్లునా:—మహాప్రభూ! ప్రతాపమహీపాలుఁడు జాబు నాకొసఁగెను.

అక్బరు:—పృథ్వీరాజా! వింటివే భిల్లునాయకునిమాటలు.

పృథ్వీరాజు:—కాగితము కల్పింప నేర్చినవారు భిల్లులవానికిఁ గల్లలాడ నేర్పరా?

అక్బరు:—పృథ్వీరాజా! నీ బావమఱఁదిఁ గాపాడఁదలంచి నీ వెంత ముష్కరత్వముఁ బట్టుపట్టినావు. మంచిది. నీ బావకు నీవే కాగితము వ్రాసి యీ జాబుయొక్క నిజస్థితినిఁ దెలిసికొనుము. అంతవఱకు వానికి నేను బదులు వ్రాయను.

పృథ్వీరాజు:—భూపాలా! సెలవిచ్చిన నేనట్టులొనరించెద. పోయివచ్చెద.

అక్బరు:—భిల్లునాయకా! నీవీ పృథ్వీరాజు సరసకుఁ బొమ్ము. అతఁడు మీరాజునకొక జాబిచ్చును. దానికి నీవు బదులు దెచ్చియిమ్ము. పొమ్ము.

[ నిష్క్రమణము. ]

## ద్వి తీ య రం గ ము.

## ఢి ల్లీ న గ ర ము.

పృథ్వీరాజు - ప్రతాపవతి - భిల్లునాయక.

[ పృథ్వీరాజు చింతించుచుఁ గూర్చునియుండఁ బ్రతాపవతి ప్రవేశించును. ]

ప్రతాపవతి:—ప్రాణనాథా! ఏమిది? చింతించుచుఁ గూర్చుంటివి? నేఁడక్బరుపాదుషాగారి సభలో నెవరయిన నీ మానసమునొప్పించు మాటలాడిరా?

పృథ్వీరాజు:—ప్రేయసీ! నే నేమని వివరించి తెలుపఁగలను? వీరాధివీరులగు క్షత్రియులకు [illegible] మగు సమయముతటస్థించెను.

చం. కువలయనేత్రి! బాహుజులకుఁ దలవంపులు సంభవించె నీ
భువి లయమయ్యె నేఁటికయ్యె భూభుజవంశము; నీదుసోదరుం
డవమతియంచు మానసమునందుఁ దలంపక వ్రాసెఁ బాదుషా
యవనిపుఁ బ్రాపుఁగోరి యకటా! యిఁక నేమని నీకుఁ దెల్పుదున్.

ప్రాణసతీ! నేనా పాదుషా సరస క్షత్రియుల ప్రతాపమహిమం బపుడపుడు గొప్పరయొనర్చి వర్ణించుచు క్షత్రియకులాభరణుండగు ప్రతాపుఁడు వానిని లోఁగొన నసాధ్యంబని నుతించుచుంటిని. ఆ నా మాటలచే నెత్తిపొడుచుచు నేఁడు సభలోఁ బాదుషాగారు నన్నుఁ బరిపరి విధంబులఁ బరిభవింపఁజూచిరి. అయినను నేను వారికిలొంగక ప్రతాపునిచే నాజాబు వ్రాయఁబడలేదని వాదించితి. అందులకుఁ బాదుషాగారు మానసంబు సడలినిసి ప్రతాపునకు వ్రాసి దాని యథార్థంబు నానోటనుడువవలెనని యాజ్ఞాపించినారు. ఆ ప్రతాపునినుండివచ్చిన యీ భిల్లునాయకుని నావెంటఁబంపినారు.

ప్రతాపవతి:—[ భిల్లునాయకునిఁ జూచి ] భిల్లునాయకా! నీవు మాయన్నగారివద్దనుండి వచ్చితివియా?

యీజాబువ్రాసెనోగదా? దారిద్రము ధైర్యనాశనమనుసదినిజమయ్యె! (పృథ్వీరాజునుఁ జూచి) ప్రాణేశా! కష్టకాలంబున నాయన్నకు ధైర్యంబుఁజెప్పువారులేక యింతటి కార్యంబు తటస్థించినది. నాసరసనుండు సొమ్మంతయు నేనువారికిఁబంపెద. ధైర్యవచనజాలంబులనించినీవొకజాబువ్రాయుము. నీమనోభీష్టంబు సఫలమగును.

పృథ్వీరాజు:— భామా! అటులనేచేసెద. నీసొమ్ములేగాక యింటనుండు వెలగలసొమ్ములన్నియునమ్మి మీయన్నకుఁబంపుము. నేజాబిపుడే వ్రాసెదను.

శా. శ్రీమద్రాజకులావతంస! కనుమా శ్రేయోభివృద్ధిన్ మహా
క్షేమంతుండు గుణాన్వ్యాంశంచును ప్రసిద్ధిన్ జెందుమా! భూభుజ
స్తోమంబెల్లనినున్ నుతింపస్వామతాస్త్ర కావనుండై భుజ
స్థేమంబెల్లెడనించి నీవుమనుమా దీర్ఘాయువై ధారణిన్.

ప్రతాపవతి:— జాబువ్రాసినాకుఁజూపుము. నే నిపుడేవచ్చెద. (నిష్క్రమించును.)

[ప్రతాపుఁడుజాబువ్రాయనారంభించును]

అప్రతిహతనిరప్రతాపుఁడగు ప్రతాపభూపాలునకు మీబావ పృథ్వీరాజు చేయునాశీర్వాదములు. ఉభయక్షేమోపరి.

ప్రతాపభూపాలా! నీపేరిదిపాదుషాగారికినొక జాబువచ్చియుండెను. సభలోనాజాబు పాదుషాగారుఁజదివించి హర్షించిరి. నే వారినెదిరించి యాజాబునీచే వ్రాయఁబడినది కాదని వాదించితి. దానికివారు కోపగించికొని నేనేనీకువ్రాసి దానినిజస్థితినాచేటనే వచింపవలెనని యాజ్ఞాపించినారు కావున నేనీజాబువ్రాసినాడను. నీ హీనస్థితినివిని నీ చెల్లెలుపడువ్యసనంబింత యంతయని నుడువనలవికాదు. కావున నే తనకంఠసూత్ర మొకటిదప్ప మిగతవెలగలనగలన్నియునమ్మి మీపోషణార్థముపంపినది. ప్రతాపా! దినోదయమునకుజనులు ప్రభాకరునిదిక్కుఁ జూచుచుండునటుల క్షత్రియకులాభిమానరక్షణమునకు నైకులము చెడని క్షత్రియులందఱు నీదిక్కుఁజూచుచున్నవారు? సుతులకురక్షణాధారకుఁడు తండ్రిగాక వేఱొకఁడుండునే? నిష్కారణముగఁ దనయులను తండ్రివదలనగునా? ప్రతాపుఁడను మహీపాలుఁడు ప్రాణంబున నున్నవాఁడనికదా యక్బరుపాదుషా తరతమభేదంబులనెన్నుచున్నవాఁడు. అటుకాదేని రాజులనందఱినిఁదన యింటఁగసవుగంపలనెత్తుటకుఁబెట్టఁడా? క్షత్రియపురుషులు నిర్వీర్యులైయున్నారు. క్షత్రియస్త్రీలునిర్లజ్జలైబ్రదికినారు. క్షత్రియ పౌరుషాభిమానమునమ్మెడు వంతనేఱ్పరచిపాదుషాదానినంతయుఁ గొనుచున్నవాఁడు. ప్రాతాపురిపౌరుషమును వస్తువుమాత్ర మాసంతలో విక్రయింపఁబడకయున్నది. అదియసహ్యముగావున పాదుషా వెలకుమీఱినది. సహజక్షత్రియుఁడెవఁడు "నౌరోజా" సంతలోఁదనయభిమానమునమ్మ కొనఁదలఁచును? అయిననెందఱు క్షత్రియులుగుఁచుచు దానిని విక్రయించిరి? ఇతరదేశక్షత్రియులందఱు తమయభిమానములనెల్ల "నౌరోజా" సంతలోవిక్రయించుటఁజూచియు మీవారన్ నైతమచటికి

రాఁదలంచునా? ప్రతాపుఁడుతన రాజ్యధనమునంతయుఁ గోల్పోయినను క్షత్రియాభరణుండై తనమానధనంబుఁ గాపాడికొన్నాఁడను ప్రసిద్ధి లోకమెల్లన్వ్యాపించినది. వానికిప్పుడు కుందు కలుగ నేర్చునే? దురాశాపిశాచంబు క్షత్రియాధములనుబట్టి పాదుషాగారి నౌరోజా సంతకు నీడ్చుచున్నయది. ఈడ్చినది. హమ్మీరువంశజుఁడగు ప్రతాపుఁడు మాత్రమా యవమానము నుండి తప్పించుకొన్నాఁడు. పాదుషాగారిని నెదిరించుసంతటి సాహాయ్యము ప్రతాపునకు నెచ్చటనుండివచ్చినదని ప్రపంచమే ప్రశ్నించుచున్నయది. ఆప్రశ్నకునుత్తరంబు ప్రతాపుని పౌరుషమొకటియేయనియును ప్రతాపునిచేతికృపాణధారయని యొకటియనియును నేఁ బలుకుచున్న వాఁడను. ఒకానొకకాలమునందైననీ "నౌరోజా" సంతనేర్పఱచిన పాదుషాజయింపఁ బడును. ప్రాణము శాశ్వతము కాదుగావుననతఁడెప్పుడో పడిపోవును. అప్పుడుగదా క్షత్రియులందఱు క్షత్రియాభిమానబీజంబు రాజస్థాన క్షేత్రంబున స్థాపింపుమనినిన్నుఁ బ్రార్థింతురు. క్షత్రియపౌరుషాభిమాననైర్మల్యమప్పుడుగదా మరలరాజస్థానమునఁ బ్రజ్వలించుచుండును.

కం. శత్రుంజయుఁడవు నీవయ
క్షత్రియవంశాభిమాన గర్వంబెపుడున్
ధాత్రినిఁ బ్రోచెడి మానము
పత్రికఁ బొందఁగను గాత పార్థివసింహా.

ఇటని విన్నవించు. "పృథ్వీరాజు".

(ప్రతాపవతి సొమ్ములమూటతోఁ బ్రవేశించి.)

పృథ్వీరాజు:—ప్రేయసీ! కాగిదము ముగించితివి.

ప్రతాపవతి:—ప్రాణపతీ! జాబుచదివెదవా? నేనువినియెదను.

పృథ్వీరాజు:—చదివెదను. (అనుచుఁ బూర్తిగఁజదివి.) ప్రేయసీ! ఈ క్రిందనే నీ యన్నకు నీ వించుక యేమయినను వ్రాయుము?

ప్రతాపవతి:—వ్రాసెదను. (జాబుదీసికొని వ్రాఁతముగించి) నాథా! నే వ్రాసినది చదివెదను వినుము.

కం. సోదర! నతులిడి వ్రాయు స
హోదరి విన్నపము వినుము; యుక్తమటన్నన్
పాదుషబారికిఁ బడనటు
నీదారినిఁ జూచికొనుము నిజమిదికనుమా!

అన్నా! నీ బావచే వ్రాయఁబడినదంతయు నిజమని నాయభిప్రాయంబు. నౌరోజాసంతలో క్షత్రియస్త్రీలమానంబు నేఁ గాపాడినవిషయంబు లోకవిదితంబు. ఇప్పుడు క్షత్రియకుల పౌరుషాభిమానంబు గాపాడునది నీభారము. రాజ్యంబుఁ గోల్పోయి నిఱుపేదవై, పిల్లపాపలం గూడి ఘోరారణ్యంబుల సంచరించుచు, ఘోరబాధలందుచున్న కారణంబున నీ ధైర్యసారం బిమిడిపోయినదని నేఁ జింతించెద. కాదేని మీవార్ రాజ్యమునందుఁ బుట్టిన నీ సోదరి పాదుషానెదిరించి క్షత్రియస్త్రీల మానముఁ గాపాడెనన, మీవార్ రాజ్యంబునఁ బుట్టి

మీవార్ రాజ్యమేలెడు సినుఁబోలు పౌరుషాభరణుఁడు పాదుషాకాళ్లొగ్గుటకు సమ్మతించునా? ఎన్నటికిని సమ్మతింపఁడు. అన్నా! ఇంతకంటె హెచ్చు వ్రాయఁజాల. నా వదినెకు నా నమస్కారములును, పిల్లలకు నా యాశీర్వాదములు తెలుపవలెను.

ప్రతాపవతి.

పృథ్వీరాజు:—మానినీ! మనము వ్రాయఁదగినవిషయముకంటె హెచ్చుగ వ్రాసినారము. ( భిల్లువారుకు జూచి ) భిల్లునాయకా! ఈ జాబును భద్రముగ నీ ప్రభువునకు నప్పగించెదవుగదా? భద్రముసుమా! పరులహస్తమిది చేరినఁ బ్రమాదమగు. అటులనె యీ సొమ్ములమూట మీ రాజునకిమ్ము.

భిల్లునాయకుఁడు:—మహాప్రభూ! శరీరమల్లఁ గనులుంచుకొని భద్రముగ జాబును సొమ్మును జేర్చెద. ఇచట జరిగిన సమాచారమెల్లఁ జూచాతప్పక తెలిపెద. సెలవిచ్చినఁ బోయివచ్చెద.

ప్రతాపవతి:—భిల్లునాయకా! మా యింటివారికెల్లరికిని సేమిక్కలి యడిగినానని తెలుపుము. భద్రముగఁ బోయిరమ్ము.

( నిష్క్రమణము. )

తృతీయరంగము.

ఆరవళ్లి కొండలలో భిల్లులపల్లె.

ప్రతాపుఁడు - గౌరాంబ - కుబేరసేన - భిల్లునాయకుఁడు - భిల్లులు.

ప్రతాపుఁడు:—( చింతించుచు గౌరాంబనుజూచి )

ప్రతాపుఁడు:— ఉ. ప్రేయసి! తోపదేమియును; పిల్లలుపస్తుపరుండి రక్కటా!
కాయముతాలెనాకుఁ గడుకాఱియలంబడి చిక్కితీవ్ర నన్
రోయుచువైరిసేన బలురోసముమీఱఁగ నుండు నెల్లెడన్
సాయములేదు మా కిచట సారసలోచన! యేమిసేయుదున్.

అయ్యో! రాజ్యముగోల్పోయినందులకు నే దుఃఖింపను. నా కృపాణంబు నా పాణినే నిలిచియున్న నేనెంతటిరాజ్యంబునునైన నార్జింపఁగలను. ఆహారంబు దొరకక బాధపడెదనేయని నే దుఃఖింపను. వనఫలంబులంభుజించి నా ప్రాణంబు నిలుపఁగలను. అకటా! ఈ చిన్ని కుమారు లన్నము లేక చెన్నుతఱిగి వాడినవత్తులై నేలఁబడిరేయని చింతించెద.

గౌరాంబ:— చం. అవనిప! ధైర్యలక్ష్మి విడనాడకు నీవు నిరాశఁగొంచు; నే
గవులను గుండ్లచాటునను గంజియుఁ ద్రావియొ గింజమెక్కియో
చివుకుచుఁ బ్రాణముల్నిలుప సేమము చేకురుకాలమబ్బు ని
క్కువమిది నమ్ముమా మదినిఁ గుందుట ధర్మమె? పుణ్యవర్త్మమే?

ప్రాణనాథా! ఇటుచింతింపవలదు. పిల్లపాపలవ్యసనంబు నీమనంబునఁ దసలనీయకు. ధైర్యాశ

నంబుమాత్రము గాపాడికొనుము. దైవము మనపాలిటి యొకతఱిఁ గాదనినను మఱియొకతఱి రాకనిలుచునా? మనకుమాత్రము శాశ్వతముగ బహుళపక్షమే యుండునా? శుక్లపక్షము రాదా?

[ భిల్లునాయకుని ప్రవేశము. ]

భిల్లునాయకః:— మహాప్రభూ! వందనంబులిడెద.

ప్రతాపుఁడు:—భిల్లునాయకా! నా జాబుఁ బాదుషాగారికి నిచ్చితివియా? వారు దానికేమి బదులిడిరి?

భిల్లు:—మహాప్రభూ! జాబిచ్చితిని; సభలోనది చదువఁబడెను. పాదుషాగారికి మీ బావగారికిని గొప్ప వాదముజరిగెను. మీ బావగారును మీ సోదరియును సాకాగిదము నీ సొమ్ములలో నీ కందఁజేయు నటుల తెలిపినారు. ఇదిగో జాబు ఇదిగో సొమ్ములమూట.

[ జాబునుమూటయు నిచ్చును. ]

ప్రతాపుఁడు:—( జాబునంది చదివికొని చింతించుచు )

ఉ. అక్కట! బాపురాజకుల మాఁడుదిపాలయె నాదుపుట్టుకన్
నిక్కము క్షత్రియాన్వయము నీఁచయె నాజననంబు చేనయో
గ్రుక్కినవేళ ధైర్యమును జూపకవైరిని నస్యువేఁడితిన్
రక్కొనెనింద నేనుభువి రాజుగఁబుట్టిన కారణంబునన్.

( అనుచు దుఃఖించుచుఁ గూర్చుండును. )

గౌరాంబ:— ప్రాణేశా! అంతటిదుఃఖకరమైనవార్త నాయన్న యేమివ్రాసినాడు? నీచెల్లెలేమివ్రాసినది?

ప్రతాపుఁడు:—భామా! నానోట నేఁ బలుకఁజాలను. ఇదిగోయాజాబు. నీవేచదివికొనుము.

గౌరాంబ:—( జాబంది చదివికొని యాలోచించి )

ప్రాణనాథా! ఈ జాబునందు నీకు నుత్సాహకరమైనవార్తయున్నది. దుఃఖమునకేమియుఁ గారణంబులేదు.

ప్రతాపుఁడు:— ప్రేయసీ! రణమునవోడి, యడవినిఁజిక్కి ధైర్యమువీడి ప్రతాపుఁడు తురుష్కప్రభువు శరణము వేఁడెననువిందనై బ్రదికినంతకాలము నా శరీరచ్ఛాయఁబోలె ననువెన్నాడును గదా? అయ్యో! నాబావ పృథ్వీరాజెంతనొచ్చికొని యింతటి హితమువ్రాసెనో? అయ్యో! నా చెల్లెలికింగల మనోదార్ఢ్యంబు నాకులేదాయెఁగా?

గౌరాంబ:— ప్రాణపతీ! గతమునకు వెతఁజెందనేల? ఊఱడిల్లుము. మనకు శుభకాలంబువచ్చునని మదినమ్మినాను. కష్టవార్ధిలోఁబడి గట్టుఁగానక యాది తేనకఁజాడుమనకు నాయన్న ధనమను తెప్పఁబంపినాఁడు. దానినిఁబుచ్చికొనుము.

ప్రతాపుఁడు:—( నిట్టూర్పుసారించుచు ) ప్రేయసీ! దానినేనంటను. అనుదానిభాగ్యమున నేఁబొట్టపోసికొనఁదలంతునా? అన్ననై చెల్లెలికి సకలాభరణములిచ్చుటమాని, మానితఱుని చెల్లెలిసొమ్ములుగొని యన్న జీవింపనగునా?

ఉ. బావయు నాదుసోదరియు భావమునన్ గడుకుంది మాకునై
యీవిధి భూషణంబులను నిచ్చిరి కూటికి సక్కటా! భువిన్
లేవడినై మనన్ జనమ లేమలకల్మిని నంది యెవ్వఁడీ
జీవము నిల్పఁగోరు? నివి చేతుల సందఁగ నేర మానినీ!

ప్రేయసీ! ఆఁడుదానినగలుగొని బ్రదుకుదునా? నా స్థితి యంతకుదిగెనా?

( కుబేరసేన్ భిల్లులు ప్రవేశించి )

భిల్లునాయకుఁడు:—మంత్రివరా! ఇదిగో యుతఁడేమనరాజు.

కుబేరసేన్:—( వ్యసనమభినయించి దూరమునుండి )

మ. అవురా! ప్రాకృతకర్మ మెంతఘనమో! యయ్యారే! నాఁ భూధవుం
డవునో కాదో యెఱుంగరాదితఁడహో! యాధైర్య మాశౌర్యమా
జవసత్వం బెటుపోయె? వాఁడె నటవీసంచారమున్ గ్రాలె హా
భువిలోనన్ దురదృష్టమింతయగునే? భూతాత్మ వ్రాల్దప్పనే?

అయ్యో! ఎంతటియున్నతస్థితి నున్నవాఁడెంతటి హీనస్థితికిదిగెను? ( అనుచు సమీపించి చింతచేఁ దలవంచికొనికూర్చున్న ప్రతాపునింజూచి )

కం. లెమ్మా ప్రతాప! స్థై
ర్యమ్మును విక్రమము వైరిరాజులపై వై
శమ్మునఁజూపుము యీవ్యస
నమ్మునకిది యదనుకాదు నమ్ముమ భూపా!

( అనుచుఁ గేలిడి లేపఁ బ్రతాపుఁడు లేచి కన్నీరుఁగార్చి కౌఁగిలించును )

ప్రతాపా! ఏమి వెసనమిది? ఏందుకుఁగాను చింతించెదవు?

( ప్రతాపుఁడు మాటలు వెళ్లక యూరకయుండును. )

భూపాలా! మాటాడవేల? ఆ తురుష్కుల నెన్నిమారులో రణమునఁ బ్రాణములఁ బాపిన నీవెటులోడితివి? నీకింతటియవస్థ యెటుసంభవించెను?

ప్రతాపుఁడు:—మంత్రివరా! దుఃఖవార్త నేనేమని తెలుపుదు? జయముమనదయ్యెనని యుప్పొంగి రిపుసేనలోఁజొచ్చి సలీమును జంపఁబ్రయత్నించి నా గుర్రమును వానియేనుఁగపైనెగరించి వానిఁబొడిచితి. వానిభాగ్యవశంబున నాపోటు వానికవచముపైదవలి యంబారిలో వాఁడు సొమ్మసిల్లిపడెను. అంతలో నెచటనుండియో రాజామాన్ సుక్తా మొదలగువారు వచ్చి ననుఁజుట్టికొని బాధించిరి. నా శరీరమునుండి గాయములచే రక్తము ప్రవింపసాగెను. తాళఁజాలక యలసిన గుర్రమయినను నెచటను నిలువక రిపుకోటిని దాఁటి పఱుగిడెతి. ననుఁబట్టుకొన రిపులు వెంబడించిరి. మనసుక్తా వారిని వెంబడించి మార్గమున వారినిఁజంపి ననురక్షించి పిల్లపాసలనుఖిలిచికొని యుడవిఁజేరుమని యుపదేశించి తనగుర్రమిచ్చెను.

కోటులోమియరునుండి మావారినిదెచ్చుట దుర్లభమాయెను. మార్గమున మూడుచోట్ల వంటలుచేసి, చేసినదిభుజించుటకనుకూలములేక గుహలలోదాగుచుంటిమి. పిల్లలుపవాసముచే నేడ్చుచుండ గడ్డిగింజలపిండితో రొట్టెలుచేసి పెట్టియుంచ వానిని నదవిపిల్లికొనిపోయెను. పిల్లలేడ్వసాగిరి. నేనాదుఃఖముఁజూచి యోర్వఁజాలక పరిభవకరముగ నేయని తలంపక, పామపాయున్నగ్రహముఁగోరి జాబువ్రాసితి. అందులకుబదులు నాభావ యీ జాబుపంపెను (జాబిచ్చును.)

కుబేరసేన:—(జాబుచదివి) ఇదికదా క్షత్రియపౌరుషము! ఇదిక్షత్రియాంగనా సాహసము! ప్రతాపా! మఱియొకటి; నీకుద్వేషియయిన నీ తమ్ముఁడు సుస్త్రా నిను రక్షింపదలంచె నెటుల?

ప్రతాపు:—సచివవర్యా! నా బాధలఁజూచి యోర్వఁజాలక దుఃఖించెనట.

కుబేర:—భూపాలా! అట్టిసమయమునదొరకినపుడు నీకుసాహాయ్యుఁడుగ వానిను.డమని యడుగవలదా?

ప్రతాపు:—పాదుషాకుమాటయిచ్చితినని దుఃఖించెను. అయినను మనవారిపై వాలమెత్తనని వాగ్దానము చేసినాడు.

కుబేర:—ఏమీ! ఏమీ! మనసుస్త్రా మనవారిపైయుద్ధమొనర్పఁడా! అదెమాట మంచిలాభము. ప్రతాపా! నీకుజయమొనఁగూడును.

కం. లెమ్మా ప్రతాపసింహ
ర్యమ్మును విక్రమము వైరిరాజులపై వై
శిన్నునఁ జూపుము యీవెస
నమ్మునకిది యదనుకాదు నష్టముమభూపా.

ప్రతాపా! ఇఁక లెమ్ము. జయమ్మునీసొమ్మని తెలెయుము.

ప్రతాపుఁడు:—కుబేరసేనా! ఏమియిటుమాటలాడెదవు?

కం. వీడునువిడి విడిముడిచెడి
కూడుఁగుడువంగలేక కుందెదునేనా
పాడిగల యరుల నెటువలె
నోడింతుఁ ధైర్యమొకటి యొప్పునె యాజిన్.

సచివవర్యా! నాకుండనిల్లులేదు. కుడువఁగూడులేదు. నిలువనీడలేదు. కలనికిబంటులేదు. నాకెటుయుద్ధమునందు జయమొనఁగూడును. ఇదియచ్చెరువుకాదా?

కుబేరసేన:—భూపాలా! ఆ చింతనీకువలదు.

చం. ఇరువదివేల బంటులకు నేఁబదియేండ్లకు మాసవేతనం
బెరవుగ నిచ్చువాఁడను జయింపుమువైరుల నీదురాజ్యముఁ.

భిల్లనాయకః:-- ప్రతాపమహీపాలా! మీ మూలపురుషుఁడగు గుహుని బాల్యమునుండి మా పెద్దలు పెంచి పెద్దఁజేసి "యీడరు" రాజ్యాభిషిక్తుఁ జేసిరి. నాఁటినుండి మీయింటియుప్పుఁదిని మీచే సకలసన్మానంబులందినాము కావున మిమ్మెప్పుడునెడఁబాయమని ప్రమాణముసేయుటకై నిటఁజేరితిమి. మా జననపురి యుదయపురి. కావున మేమచ్చట నుండునది కాదేనిఁ జచ్చునది యీరెంటిలో నొకటి నిజమని నిర్ధరించుకొనినాము. మాకు వేతనములవలదు. ఆహారధాన్యమువలదు. అడవిమృగములే మాకాహారమగును. అవి దొరకవేని చెట్లలో నుండు వృక్షఫలములు చాలును. అవియు దొరకవేని గడ్డిగింజలు మెక్కియుందుము. రణమునఁజచ్చునందాఁక పాణిని రాణించు నీకై ప్రాణంబు వదలము.

(అనుచు నందఱుఁ గత్తులు ఝళిపించి నొసటఁదగులుదురు)

ప్రతాపః:--- భిల్లనాయకులారా! సంతసించితి. మాండవ్యఋషిమతమనుసరించి మనోజయమిప్పుడు కలిగినది కావున మనము వెళ్లుదము రండి.

(భిల్లులు జయ్ జయ్ అనుచు)

[నిష్క్రమణము.]

## చతుర్థరంగము

## ఉదయపురము

ప్రతాపుఁడు - భిల్లులు - ప్రతాపుని సేన.

ప్రతాపుఁడు:---- [ఉదయపురిసమీపమున సేనకు మొనఁదీర్చి] సేనానులారా! భిల్లనాయకులారా! మన దేశము మన రాజ్యము మన పురి మరలఁగనుఁగొను భాగ్యము మనకుఁగలిగెను. అయ్యో! నాకీరాజ్యముపై నభిమానమెంతయో. మనరాజ్యమంటిని. పొరబడితిని. సేనానులారా! మన దేశమను కాలముపోయెను. తురకల దేశమను కాలము వచ్చెను. మన రాజ్యమెన్నడో పోయెను. తురకల రాజ్యమాయెను; మనపురి కాదిది. తురకలనగరు. అకటకటా!

సీ. పౌరుషంబున కెల్ల పౌరస్త్యమైమించు
మనవారిదేశంబు మమతఁగనుఁడి
సాహసంబునకెందు సామ్యమై వెలసిన
మనవారిరాజ్యంబు మమతఁగనుఁడి
ధైర్యలక్ష్మికిని నాధారమై పేరొందు
మనవారి స్థానంబు మమతఁగనుఁడి

క్షాత్రసారంబయి ధాత్రికీర్తినిఁగన్న
మనమాతృరాష్ట్రంబు మమతఁగనుఁడి

గీ. మనము పుట్టినపురి యిది మమతఁగనుఁడి
మనము పెరిగిన తలమిది మమతఁగనుఁడి
మనముకట్టిన చెరువిది మమతఁగనుఁడి
మనము తనివోందు దీనినిఁగనిన మీకు.

భ్రాతృవరులారా! ఇట్టిమనపురికి మనము వెలిపోతిమి. అయ్యో! మనపెద్దలిందుండి తమ పుత్ర పౌత్రాదిసంతతికి సుఖాలవాలమగునని యెంచికదా మందిరంబులు కట్టించిరి. బావులు త్రవ్వించిరి. ఉదయసాగరము చెఱువును ద్వాదశవర్షంబులు గట్టిరి. మానము లేర్పఱచిరి. పరసుఖమునకై పరమాత్ముని యాలయంబులేర్పఱచిరి. మనసేమమునకై వారొనరించినదంతయు మనవిరోధులకు పాలుపోసితిమి. మనముదూరమైతిమి.

సీ. మనకునై మన పెద్దలను వోవఁగట్టిన
మేడలు తోరకల వీడులయ్యె
ఆర్యుల దేవాలయంబులు యవనుల
ప్రార్థనగృహములై పరిఢవిల్లె
ఆగమోక్తవిధానమమరియర్చనలందు
మనవిగ్రహంబులు మన్నుఁగలిసె
లోకైకలింగము మాయేకలింగము
రుబ్బుగుండయ్యెఁ దురుష్కతతికి

గీ. మనజననభూమి యరులకు మాన్యమయ్యె
మనహరువులన్ని రిపులకు మనుకులయ్యె
మనుతమముగన్న యభిమాన మందిరములు
పాడుతోరకల పాలౌటఁజూడఁగలమె!

సోదరులారా! మనపెద్దలచే సార్జింపఁబడిన యీపురినిఁ గాయుటమన ప్రాణములు గాయుట కదా? మున్నేకచక్రపురజనులు బకాసురునిచేఁ బీడింపఁబడినగండ మోర్చిరిగాని జననభూమి వదలరైరి కదా? దేశమెంతవిశాలమైనను, ఇతరదేశములం దెంతటిసుఖముండినను, మానవుఁడు తాఁబుట్టినగ్రామమున నెంతకష్టముండినను దా, మానసెర్చునే? జననపురాభిమాన పాశంబు మానవుని నెంతదూరమునుండియైన నీడ్చికొనసఁగుంపఁ దెచ్చికొనునుగదా? అట్టియభిమానంబు లేనివాఁ డొకమానవుఁడని యెంచనగునా? చతుర్విధాభిమానంబు లుత్తమపురుష భూషణంబులు. స్వాభిమానంబు మొదటిది. ఇందుమతాభిమానంబు చేరును. స్వగృహాభిమానంబు రెండవది. స్వనగరాభిమానంబు మూడవది. స్వరాష్ట్రాభిమానంబు నాల్గవది. ఈయభిమాన చతుష్టయములేనివాఁడు మానవగణములోఁ జేరినవాఁడు కాఁడు. ఈయభిమానంబు మన ధైర్యశౌర్య సాహసంబులకు నేఁడు ప్రోత్సాహకసాధనమైనవి. మురికొల్పెడుఁగావున మనమిపుడు ప్రాణంబును సరకుసేయక యీమనపురము సాధింప సాహసింపవలెను. ప్రాణంబునిలిచి జయము మనదయ్యెనేని మనమందిరములలో మున్ను బలె నెప్పటి జేయుచుకొని సుఖముగ నిద్రింపవచ్చును. అటుకాదేని యీతుచ్ఛశరీరమార్యావర్తమునకై దానమొసగి సూక్ష్మశరీరమంది స్వర్గసుఖంబుఁ బడయవచ్చును. జయమిహసుఖమిచ్చును. చావుస్వర్గసుఖమిచ్చు. ఇవి రెంటిని వదలి ప్రాణంబు తీపని, రణము వదలితిమేని శాశ్వతనరకంబుమనకు దప్పదు. మనుస్మృత్యాదినిభుజబలసాహసమున భూమినేలవలెననికదా బ్రహ్మభూభుజులను సృష్టించెను. అట్టిక్షత్రియధర్మంబు మానఁదగునే? మానినచో మనముకులహీనులము గామా? భ్రాతృవరులారా! నిజముగ క్షత్రియశుభేచ్ఛ సముద్భవులము మనమని స్థాపింప నేఁడుగదా సమయము తటస్థించె. ప్రాణమో మరణమో యనునది నేఁడు గదా యేర్పడును? ఇహలోకమో పరలోకమో మనకు నేఁడుగదా లభించు. హా! దైవమా! మీవీరక్షత్రియుఁడు పితృకీర్తియనునింద రానివ్వక పోషించుభారము నీయది. క్షత్రియసోదరులారా! భిల్లునాయకులారా! అలనాఁడు గుహుని గెలిచి యరినాశనంబొనరించి యాదూరునఁబట్టము గట్టి మనుమీముత్తాతల సాహసంబు నిజమని నేఁడుగదా మీరు స్థాపింపవలెను.

భిల్లునాయకుఁడు:— ప్రతాపమహీపాలా! ఈ దినంబున "ఉదయపురీ రాజసింహాసనంబున" నినునిలుపమేని మేము తద్వంశజులము గామని నమ్మెము. ఆలస్యంబేల? ఆజ్ఞయిమ్ము.

చం. ధరణిపలగ్గ కెక్కుదుమె? దారి యొనర్తుమె కోటగోడలో?
సరవిని ద్వారముల్ తెరచి చయ్యనలోపల జూచు జాతుమే?

తురితమునన్ దురుష్కులను దుత్తుమురైపడఁ జేతుమే! వెసన్

నరవర యాజ్ఞయిమ్ము రిపునాశన కాంక్షిగమ్ము యిమ్మహిన్.

ప్రతాపుఁడు:——భిల్లనాయకులారా! లగ్గకెక్కి కోటనుసాధించుట మీ పౌరుషసాహసంబులకు మార్గంబని నేనెన్నెద.

భిల్లనాయకులు:——మేమటుల నేయొనర్తుము.

[ అనుచు నొకరిపై నొకరెక్కి వగ్గము పైకివేసి తత్సాహసంబున నందఱు గోటనెక్కి దురు. లోఁగా కలకలధ్వనులగును. కోటవాకిలి తెఱువంబడును. అందఱు లోఁబ్రవేశ. యుద్ధముజరుగును. తురకలు దిక్కుకొకరుపరుగిడుదురు. ]

[ నిష్క్రమణము. ]

పంచమరంగము.

ప్రతాపుని మరల రాజుగా చేయుదురు.

సమాప్తము.